# మాలదాసు



గ్రంథకర్త:

వంగిపురపు రామభద్రయ్య,

బి. ఏ., బి. ఇడి.,





 1960 (Price Rs. 2-0-0

A. Gopalakrishnamurty M. A., LL. D.,
Advocate, Tenali.

# పరిచయము:

మిత్రులు వంగిపురపు రామభద్రయ్యగారు ఉపాధ్యాయ వృత్తిలో పండువారుతున్నారు. చూపులకు, నడకలో యేమి తెలియని మానిసిగా కనపడతారు. 'విద్యయొసగిన వినయమే' దానికి కారణము. లోని విజ్ఞానాత్మకదీప్తిని వెదజల్లవలెనన్న పూనికి విశేషం. అయితే, సంఘసంస్కరణాభిలాష హెచ్చుగుట వారిరచనా విశేషస్ఫోరణకి ఆవైపునకే వారిని మరల్చినది.

మన సంఘం చాలగా పురోగమించి, యెంతగానో ముందుకు వెళ్లినదని భావించేవారు కలరు. ఈభావనకు పట్టణవాసులు ప్రధాన భూమికలు ధరింతురు. మన సాంఘిక వృత్తి, ప్రవృత్తి యేమాత్రం మూలంలో మారలేదు. 'మీసాలపై తేనియలే' అన్నట్లుగా పైపైపూతలలో, చిన్నిచిన్ని మోతాదుల్లో తప్ప, యింతవరకు సరియైన చిత్తసంస్కారం జరుగలేదు. చిత్తసంస్కారంలేనిది సంఘసంస్కారంరాదు. సంఘసంస్కారంరానిది, సాంఘిక విప్లవం వ్యర్థం. సాంఘిక విప్లవంలేనిది సమాజ పునర్నిర్మాణం అసంభవం. సమాజ పునర్నిర్మాణం జరగనిది, సాంఘికాభ్యున్నతి వుండదు. ఎట్టి రాజకీయ, ఆర్థిక వృత్తుల పరిణామాలకైనను, సక్రమమైన సాంఘిక నిర్మాణాల పైనను, భావవిప్లవం అత్యవసరం. ఆలోచన లేని ఆచరణ అనుచితం కాక తప్పదు.

అందువల్ల యీవాస్తవాన్ని గ్రహించిన రామభద్రయ్యగారు 'మాలదాసు' గ్రంథకర్తగా వివరణపొందారు. చదువు

తుంటే యథార్థపరిస్థితులను అర్థంచేసుకొన్న హృదయం కనబడుతుంది. ఆనాటి కుటుంబములలోని పెద్ద వయస్కుల భావాలకు చిన్నల భావాలకువున్న వ్యత్యాసాన్ని చూపారు. సమాజంలో సంఘర్షిస్తున్న సామాజిక భావాల్ని విప్పిచెప్పారు. దానికై వలసిన పాత్రల్ని సృజించారు. ఇప్పటి సమాజంలో యిట్టి పాత్రలు, ఆపాత్రలు కలవా అంటే 'బోలెడన్ని' అని సమాధానం చెప్పవచ్చు.

వృత్తులలో వచ్చిన శ్రద్ధలేమిని, విగజాతకులను, పురోహితుల సంభాషణలో తాళికట్టుట మరిచిన విధానాన్ని వివరిస్తూ, కందుకూరిని గుర్తుకుతెస్తూ, చిలకమర్తిని జ్ఞాపకం చేస్తూ ప్రహసనస్థితిని చేకూర్చారు.

'నీతికి, సమాజంలో వున్న స్థాయి ఆచరణలో అన్వయం చేయటంద్వారా పెంచవచ్చునని రచయిత భావన. నాటకంలో తొంగిచూస్తూ, పింపసలాడుతూ కనబడుతుంది. నాటకంగా దీనిప్రశస్తి యేమున్నా విచారణలోనికిపోను. రచనగా, చదువరులను వుద్దీపింపశక్తి కలిగిన రచనగా దీనికిస్థానం దొరుకుతుంది. రచయిత జాతీయతను, సాంఘిక ప్రగతిని ముడివేసిచూచారు. కాని, సాంఘిక ప్రగతికి కొంతదూరం వెళ్లి, యెదురు తిరిగే జాతీయతలోని అవగుణాన్ని చూడ పట్టుకోలేము. నిజమైన సాంఘిక ప్రగతి జాతీయతను దాటి వెళ్లుతుంది; జాతీయత దేశాన్ని, పూర్వపు గౌరవాన్ని పట్టుకు వెంటాడుతుంది. సాంఘిక ప్రగతి మానవుణ్ణి పట్టుకొని సంచాలన పొందుతుంది.

ఇది నాజూకోతరం. నాజూకుకువున్న విలువ నాట్యానికి

లేదు; ప్రచారానికి వున్న విలువ ప్రశస్తికి లేదు. అందువల్ల, అందరూ అభ్యుదయ కాములుగా నటిస్తారు, కనిపిస్తారు, వినిపిస్తారు. కాని ఆచరణలోనికి అభ్యుదయం, తిరోగమనం కనబడుతుంది. సమాజంలోని సంఘర్షణ, వ్యక్తిలోని సంఘర్షణలను మనం గుర్తించాలి. వాటిని తీర్చిదిద్దాలి. సాహిత్యనిర్మాతలకు యీదృష్టి ముఖ్యంగా అవసరం. మనరచయిత యీ సూత్రాన్ని గ్రహించినందునే, నేటికీ సంఘంలోని అవసరాల్ని గుర్తించి, యీరచన, పాతకాలంలో వ్రాసినదయినా యిప్పుడు అచ్చువేస్తున్నారు.

పద్యాలతో నాటకాన్ని నింపారు. దానివల్ల సాహిత్య స్థాయి పెరుగుతుంది. రంగస్థల అవసాలకు చిక్కురావచ్చు. రచయిత సాంఘికరంగంలో యజ్ఞానికి సమిధల్ని తయారుచేస్తున్నారు.

వారి ప్రయత్నం జేగీయం కాగలదని, దానికి ప్రాజ్ఞుల సహకారం అబ్బగలదని ఆశిస్తున్నాను.

ఉగాది,
28-3-60.

ఆవుల గోపాలకృష్ణమూర్తి.

# ఉపోద్ఘాతము

శ్రీ వంగిపురపు రామభద్రయ్యగారు వ్రాసిన "మాలదాసు" అను నాటికను చదివితిని. సంఘమునందు హరిజనుల యెడ జరుగు అన్యాయములను ప్రకటించి, ప్రజాహృదయమునందు వారిపట్ల ఆదర, సానుభూతులు ప్రభవించుటకై యీ నాటికా రూపమున వీరు కృషిచేసినారు. ఈ ఉద్దేశము శ్లాఘాపాత్రముగా నున్నది.

సాంఘిక దురాచారములను సంస్కరించుటకు ప్రభుత్వ శాసనములు మాత్రమే చాలవు. వానికి వెనుక బలమునిచ్చుటకై జనహృదయములందు చైతన్యము సమీకృతము కావలెను. అట్టి చైతన్యము కలిగించుటకు సాహిత్యము ముఖ్యసాధనమనుట ఎల్లరంగీకరింప దగిన విషయము. ఈ ప్రయోజనము సాధించుటకు రెండు పద్ధతులుగలవు. ఒకటి హరిజనులను భూషించుటకై, యితరులను దూషించుట. రెండవది హరిజన సోదరుల యందు మానవత్వమును ప్రతిపాదించి వారియందు సహజముగాగల సద్గుణములను వెలుగుపెట్టి ప్రకటించుట. కొందరు వీరసాంఘిక సంస్కర్తలు మొదటి మార్గము నవలంబించి రాణింపదలంతురు. దీనివలన ఎవరి హృదయములందు పరివర్తనము తేదలచినారో అచ్చట గుప్తద్వేషమును, ఉపేక్షాభావమును మాత్రమే పాదుకొల్ప గలుగుచున్నారు.

రెండవ మార్గము మొదటిదానియంత ఆర్భాటముగా నుండకపోవచ్చునుగాని యది కలిగించు పరివర్తనము సుకుమారము, స్థిరము అయియుండగలదు. వంగిపురపు రామభద్రయ్య

గారు తమ నాటికయందే రెండవ త్రోవను నడిచిన విజ్ఞులనా నాకు తోచుచున్నారు. కానైతే వీరి రచనను సాహిత్యగుణములందును, భాషాసౌష్ఠవమునందును నేలవిడిచి ఎక్కువ యెత్తునకు ఎగుర లేదనుట తెల్లమైనను, వారుద్దేశించిన సత్ప్రయోజనము సాధించుటలో "మాలదాసు" నాటిక ప్రశంసార్హమైన విజయమునే పొందినదనుటయు తథ్యమే. "మానినది మందు" అను సామెత మనకున్నది. ఈ నాటికను ప్రదర్శించగా చూచిన ప్రేక్షకుల హృదయములందు హరిజన సోదరులయెడ గౌరవాదరములును, వారి సంక్షేమమునకై పాటుపడు సజ్జనుల యెడ సౌమనస్యమును తప్పక కలుగగలవని చెప్పనొప్పును. రామభద్రయ్యగారు కృతకృత్యులైరనుటకింక సందియమేల.

సాహిత్యమొక అపూర్వమైన యద్దము. అందులో మనకు మనము విచిత్రముగా కాన్పింతుము. ఎంతయాత్మ విశ్వాసపరులైనను తమలోపములను తాము గుర్తింపజాలరు. అవియే సాహిత్యాదర్శమునందు ప్రతిఫలించునప్పుడు వింతపరిణామమును కల్గించును "మాలదాసు" నాటికయందలి ముఖ్య పాత్రలు నిరంజనదాసు, భాస్కరరావు, మురళీధరశాస్త్రి, కల్యాణి, విశ్వపతి. వీరందరును వాస్తవ జీవితమునకు సన్నిహిత ప్రతిబింబములు ఈ నాటిక విజయము పాత్రపోషణమునందును, సంభాషణముల నైర్మల్యమునందును చూడనగును. కవిగారి పరిశీలనా పాటవము బైరాగి కల్పనయందును, న్యాయస్థాన రంగమునందును చూడనగును. హరిజనులయెడ సంఘ పరివర్తనము నేగాక హరిజనులయందును మూఢాచారపరిత్యాగ

రూపసంస్కారమును కలిగించుటకు రామభద్రయ్యగారు యత్నించుట ఉచితముగానున్నది. వీరు తమ మున్ముందు రచనలలో ప్రచారమను మాత్రను అచ్చుపు సాహిత్యమను వెన్నముద్దలో పొదిగి సాహిత్య శ్రేణికి అధిరోహింతురని యాశింతము.

హైదరాబాదు
25—1—60 } ఖండవల్లి లక్ష్మీరంజనం M. A.,
ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆంధ్రశాఖాధ్యక్షులు,
హైదరాబాదు.

# పరిచితి

'మాలదాసు' చక్కని సాంఘిక నాటకం. హరిజనాభ్యుదయానికి సంబంధించినదని ఆమూలాగ్రం చదువకనే ఎవరైనా చెప్పగలరు.

జాతిపిత పూజ్య బాపూజీ సత్యాహింసల సాధనంతో మనకు స్వాతంత్ర్యం సంపాదించి పెట్టారు. దానిపరిరక్షణకై సంఘవ్యవస్థనుచక్కబరచాలనే ప్రయత్నంతో, రాట్న చక్రం త్రిప్పి నిరుద్యోగ సమస్యను రూపుమాపినారు. మానవసేవయే మాధవ సేవయని నిరూపించారు. పరమాత్మకు పరమతమనేది లేదనీ, ఆతడి అర్చనా విధానంలో అంటరానితనం మహాపచారమనీ చెప్పి వైష్ణవునకుండవలసిన లక్షణములను విశదపర్చారు.

పై క్రియలలో - ఏకాంగియైననూ, ప్రధానాంశమైన హరిజనోద్ధరణ కార్యక్రమం నేడు దేశంలో దశదిశలా వ్యాప్తి చెందింది. ఉడుతాభక్తితో 'మాలదాసు' కూడా యీ కార్యక్రమాన్ని విజయవంతం చేయగలదని ఆశిస్తాను.

రచయిత శ్రీ వం. రామభద్రయ్య యొక్క ఉత్సాహ వెల్లువకు అడ్డుకట్ట వేయటంకాదుగాని, నాటక రచనా విధానంలో ఆ, యా పాత్రల మనోస్థితి ననుసరించి పాటలుగాని, పద్యాలుగాని వుండవలసిన అవసరాన్ని గుర్తు చేస్తూ యీ వర్ధమాన రచయితకు ఉజ్వల భవిష్యత్తు కల్గించటానికై పరమాత్మని ప్రార్థిస్తున్నాను.

ఇట్లు
ప్రభాకర్

ఆంధ్రప్రదేశ్ సర్వోదయమండలి
గాంధీభవన్ - హైదరాబాదు.

# షోడశదళగర్భకలిత చమత్కార సీసము



# మాలదాసు

## పాత్రలు

పురుషులు:-

| | |
|---|---|
| మురళీధరశాస్త్రి:- | సనాతనుడు |
| విశ్వపతి:- | మురళీధరుని మేనల్లుడు |
| నిరంజనుడు:- | కమతగాడు |
| భాస్కరుడు:- | సంఘసంస్కర్త |
| వెంకటేశ్వరశాస్త్రి:- | పురోహితుడు |
| సోమంభొట్లు, ఈశ్వరంభొట్లు | బ్రాహ్మణులు |
| వైరాగి:- | నిరంజనదాసు మారువేషము |

జడ్జి

రామారావు-ప్రాసిక్యూటరు } సెషన్ కోర్టు
సుబ్బారావు - వకీలు.

పోలీసు సబ్ ఇనస్పెక్టరు, పోలీసులు.

స్త్రీలు:-

| | |
|---|---|
| కల్యాణి:- | మురళీధరశాస్త్రి కుమార్తె |
| లక్ష్మాయమ్మ:- | భాస్కరుని తల్లి |

---

గమనిక:- ఈ పుస్తకములో 32వ పేజీ నుండి 41 కి వరుస తప్పియున్నది. 41 నుండి పేజీలు 33గా భావించ చదువరులకు తెలుపుటయైనది.

•

# వరవిక్రయము

ప్రథమాంకము 1 వ రంగము

మురళీధరశాస్త్రి గృహము.

(మురళీధర్, వెంకటేశ్వరశాస్త్రి, నిరంజనదాస్)

మురళీ॥ అదేనోయి నేను ఆలోచిస్తున్నాను, మా విశ్వపతే నిజానికి బుద్ధిమంతుడైతే నేను వేరే సంబంధం విచారించే అవసరం ఎందుకుంటుంది చెప్పు ?

సీ॥ మరణించునపుడు సోదరి నాడుగూతుని
తనయునకీయ వాగ్దత్తమొందె
అల్లునిలక్షణంబరసినా యిల్లాలు
చిఱుతనీయకటంచు చెప్పిసమసె
పసితనంబునుమొదల్ నిసువును బ్రేమతో
బెంచి యన్యులచేత బెట్టవలసె
నైదోడుసుతుడు విశ్వపతిదుర్మార్గంబు
తిలకించి యోర్చి చింతింపవలసె

తే॥ గీ॥ అక్కమాటల నేలీల నాదరింతు ?
నాలిబాస నెవ్విధమున నాచరింతు ?
కలదుముందునగోయి వెన్క నొక నూయి !
యేమితోచదు శాస్త్రి ? నాకేదిదారి ?

వెంక॥ నిజమే పాపం, అదిగాక ఎందుచేతనోగాని మనవిశ్వపతి

శాస్త్రిగారినిగురించి, క్షమించండి, మంచివదంతులు లేవండి.

మురళి:— అవునయ్యా! ఎలావుంటాయి ? ఎవరినోరు మూయ గలం ? కుండమూయను మూకుడున్నదిగాని నోరు మూయను మూకుడున్నదా ?

వెంక:— అయినాపాపం, ఆయనా బుద్ధిమంతుడేనండి మొన్న మొన్నటివరకూ—

మురళి:— ఆ! చెప్పుకుంటే సిగ్గుచేటు. ఇంట్లో చెంబుతప్పాలాలు తీసుకుపోయి కుదువపెట్టి త్రాగుతున్నాడు. రక్తస్పర్శ కావడంచేత అనలేకవూరుకుంటున్నాను. తల్లిదండ్రిలేని సన్యాసని నేను వెళ్ళగొడితే యేచెట్టుపాలో, యేగుట్ట పాలో అవుతాడని సహిస్తున్నాను.

వెంక:— అవునులెండి, తల్లితర్వాత తల్లియంతటివారు మీరు. మీరు కడుపులోపెట్టుకోకపోతే పరాయివాళ్ళు పెట్టు కుంటారా ? అయినాచిన్నతనం.

మురళి:— ఇంకాచిన్నతనంఏమిటి? పాతికేళ్ళు నెత్తికొచ్చి సంసా రము దిద్దుకోవలసినవాడు, ఈవిధంగా ఎంతకాలం సహించేట్టు ? పదిరోజులనాడేమి జరిగిందో విన్నారా ?

వెంక:— ఏమిటది ?

మురళి:— తల్లితద్దినంమూని తాగి తందనాలాడుతున్నాడు. వీడి వల్ల నాగౌరవముకూడ పోతున్నది.

వెంక:— కాదూమరి. అయితే అమ్మాయికి వేరేసంబంధమే ?

మురళి:— లేక చూస్తూచూస్తూ కన్నబిడ్డ గొంతుకోసే మూర్ఖు

డుంటాడా శాస్త్రీ? అందుకనే నిన్ను పిలిపించింది. ఇక వేరే ఆలోచించక, సంబధాలేమైనవుంటే చెప్పు.

వెంక:- అయితే చూడండి! మన జోస్యులవారి అబ్బాయిని మీరెఱుగుదురుగా ?

మురళీ:- ఏబ్బే! వాడటోయి, నాటకాల్లో ఆడవేషాలు వేసేవాడు. ఛా, ఛా. మరేదైనా మంచిసంబంధం చెప్పాదూ? భూమి బొట్రావున్నా శాస్త్ర డోక్కశుద్ధికూడ ఉండవద్దూ!

వెంక:- సరే పోనివ్వండి మరి...అన్నట్లు మనలక్ష్మాయమ్మగారి అబ్బాయి ఉన్నాడుగా ?

మురళీ:- అవును. బాగున్నది. బుద్ధిమంతుడు. బి. ఏ చదువుతున్నాడు. కలిగిన కుటుంబంకూడ. ఆలోచించవయ్యా శాస్త్రీ!

వెంక:- ఆలోచించడానికేమిగాని, లక్ష్మాయమ్మగారు ఆ అబ్బాయి చదువుఖర్చంతా కట్నాలమీదనే రాబట్టాలనే ఊహతో వుందండి.

మురళీ:- ఆ. అంతయెవడు భరిస్తాడు. ఏదో లాంఛనాలంటే చెప్పావు.

వెంక:- ఏలాగైనా రెండువెయ్యినూట పదార్లకు తగ్గదు. అయినా తర్వాతమాత్రం ఆస్తంతా వారిదేకాదూ!

మురళీ:- అబ్బా! శాస్త్రీ. ఆలోచించవోయి, నీయిష్టంవచ్చినట్లు. అంతకుమాత్రం మించనివ్వకు. సరేనా?

వెంక:- సరే...సరేకాని...

మురళీ:- ఇంకా కానియేమిటి కాని, అర్థణా, నీసంగతా? నాకు తెలియదటోయి అలాబ్రతికేవాడవు? పనిపూర్తి చేసుకురా. తర్వాతనీవున్నావు, నేనున్నాను. ఆ!

వెంక:- చిత్తం. సెలవు. (వెళ్లును)

(మురళీ వెళ్ళబోగా దొరగారూ అని కేక)

మురళీ:- ఎవరురా? దాసూ! ఎక్కడికి వెళ్ళావు ప్రొద్దుటినుంచి?

నిరం:- తూర్పుపొలంనుంచి వస్తున్నానండి.

మురళీ:- ఉదయంనుంచి యేమిచేశావు?

నిరం:- అరటితోటకు కొబ్బరితోటకు నీళ్ళుపోసి తూర్పు పొలంలో వోదెలను కట్టలుకట్టి వస్తున్నానండి.

మురళీ:- సరే. పడమటపొలంలో నీళ్లున్నవట. కాలవచేసి నీళ్లు వెళ్ళగొట్టిరా. ఇంకాగంట ప్రొద్దున్నది.

నిరం:- ప్రొద్దుటనుంచి గంజితాగలేదండి. కూటికి గింజలులేక యింటిల్లిపాది నిన్నటినుంచి పస్తున్నామండిదొరగారు. గింజలిప్పాస్తారేమోనని వచ్చాను. గింజలింటికాగ్గెర పోసి కాస్తగంజితాగి పడమటిపొలం వెళ్ళి వస్తానండి.

మురళీ:- ఆహా! పొలంవెళ్ళడానికి తీరికలేదు. ముందుగింజలు కావాలా?

నిరం:- నాకుఆరుమాసాలకూలి ఇవ్వాలగాదండి. అందులోవే యిప్పించండి. బొత్తిగా తిండికిలేకవచ్చాను. పనిచేయ వస్తానాబాబూ.

మురళీ:- చెప్పేదినీకే. పోరాముందు పనిలోకి. గింజలిప్పుడు ఇంట్లో ఎమకునాబోసుక్కూచోలే.

నిరం:- బాబూ, మీపనులుచేస్తూ మీరివ్వవలసిన కూలి గింజల్ని అడిగితే, మీరేయివ్వకపోతే యిక మాగతి యెవరు విచారిస్తారు ? కూడుతినకుండా పనిచేసి యెన్నాళ్లు బ్రతుకగలం ?

మురళీ:- అరేదానూ ! లేదన్నప్పుడు చెప్పినమాటవిని వెళ్లు. మొండికిబడి నన్ను వేధించకు. పో.

నిరం:- పోనీయి ఆకోటిశెట్టిగారి కొట్లో అయినాచెప్పించండి. గింజలు తెచ్చుకుంటాను.

మురళీ:- ఆహా ! నీకోసం కోమటికొట్లో బాకీలుకూడా పెట్టమన్నావా ? ఏమైనా తనఖాకూడ పెట్టాల్నా ? నాకు చిరాకు తెప్పించక ముందు వెళ్లు.

జీత:- (ప్రవేశించి) అయ్యగారూ. అమ్మాయిగారికి పన్నీరు సీసా కావాలంటిరే, ఇదిగో తెచ్చాను. చూడండి.

మురళీ:- ఎవరికొట్లో ?

జీత:- బొమ్మిడాలవారి కొట్లో .

మురళీ:- ఎంతకిచ్చాడు ?

జీత:- నాలుగు రూపాయిలట. మీరిచ్చిన రెండురూపాయిలిచ్చాను. మిగతారెండు పంపిస్తాననిచెప్పి వచ్చాను. ఇస్తారా ?

మురళీ:- (బొడ్లోనుండి తీసియిచ్చి) ఆ ఇదిగో. పోయి ఇచ్చిరా ? (నిరంజనునిజూచి) అరేదాసుగా. కూర్చు న్నావేరా అట్లాగే. ఆ మెరకచేనికి పోయిరా. నా కింట్లో పనియున్నది. వెళ్ళాలి (అనివెళ్లును)

నిరం:- ఆహా ! కాపులకింత కఠినహృదయమా ? మాగోడు రవ్వంతైన ఆలకించరే ! పైగా పస్తులతో చస్తున్నా మని యెంత మొరబెట్టుకున్నను పెడచెవిని పెడతారే! మా చేత నానాచాకిరి చేయించుకొని, కూలిగింజ లిమ్మంటే వీరికింతకష్టమా ? వారిసుఖాలు, వారిఆనం దాలు, వారిబుద్ధే వారికిగాని మాకూలీల కష్టాల నెవ రాదరిస్తారు ?

సీ॥ అంతఃపురాలలో హాయిగా తూగుటు
యాల్యాలలలోనూగులాడు చుంద్రు
ఆనందమున మత్తులై కాటునులగూడి
సరససల్లాపముల్ జరుపుచుంద్రు
బ్రాందివిస్కీబుడ్లపై భ్రమగల్గ నెం
తెంతడబ్బైన వెచ్చించుచుంద్రు
కార్లుజట్కాలునౌకర్లు చాకర్లతో
అట్టహాసపు పైపుళ్ళు కొట్టుచుంద్రు

తే॥ గీ॥ అంతెకాని యాకటిమంట కగ్గమగుచు
కడుపుకాలెడి కూలీలకష్టములకు
సానుభూతిజూపెడిధన స్వాములెచట
కానరారాయె ముచ్చటకైన నేడు.

రైతుకూలీ ప్రజారాజ్యంగా నేర్పడ్డ యీగడ్డ నడి బొడ్డున, జమిందారీవిధానం నశించినా, ధనవంతునిలో మార్పుగానరాలేదు. ఆకలిమంటచేత నల్లాడు బీదజను లకు తిండి, గుడ్డ, యిల్లు జేకూర్చిననాడే కదా యే ప్రజారాజ్యమైనను రామరాజ్యముగా మారుట.
(వెంకటేశ్వరశాస్త్రి నుకియొక వైపునుంచివస్తూ)

వెంక:- మాలవెధవా! సిధిన నడుస్తుంటే కళ్లుకన్పించలా? అలా పైకివస్తావు?

నిరం:- అయ్యో బాబూ! మీరేవచ్చి నామీదపడి, నన్ను తిడతారేమండీ?

వెంక:- మరి నడివీధుల్లో నిలుచుంటే మీకుమాలదొరలని యెవరికి తెలుసునోయి. మాలవాడివి కాస్త తొలిగి నిల్చోవద్దూ.

నిరం:- బాబూ. మాలవాడు మానవుడు కాడూ?

వెంక:- మానవుడో, దానవుడో నాకేం తెలుసు? అసృష్టించిన బ్రహ్మకి తెలియాలి. వేదాలువ్రాసిన వ్యాసునికి తెలి యాలి. విద్వాంసుడవైన నీకు తెలియాలి. అంటరాని వాడన్న ఆచారమిప్పుడుపుట్టిందా?

నిరం:- క్షమించండి, తెలియకడుగుతున్నాను. కోప్పడకండి, కుక్కల్ని, పిల్లుల్ని మీరు తాకుతారు కాదూ?

వెంక:- అయితే మీకువాటికి సంబంధమేమిటి? నోరులేని జంతువులు. వాటికి అంటూ, సొంటా?

నిరం:- అంటే అంటు అంటుకున్నది, మాకేనా బాబు! జంతువుల కంటె హీనమేనా మేము ?

వెంక:- కాకపోతే మరేమిటి? అంటరాని దోషం ఎందుకుంటుంది మీకు? ఊరికె యెందుకుంటారు మీరు?

నిరం:- బాబూ! ప్రజాసేవ జేసే మాలవాణ్ణి అంతనీచంగా ప్రపంచంలో జూడవచ్చునా?

సీ॥ చచ్చినపసుల మసానంబునకు సేవ
పడక మోయగనోపు వారలెవరు?
చర్మసంస్కారంబు సల్పి లోకులకెల్ల
పాదరక్షల నిచ్చువారలెవరు?
దినమెల్ల కూలినాలి జేసి రైతుల
దారిద్ర్యమును మాపు వారలెవరు?
పట్టణంబులలోన పాకీపనులకోర్చి
యారోగ్యమును గూర్చు వారలెవరు?

తే॥ గీ॥ వారువీరని నేల? మీవారె మాకు
ప్రభువులంచును భావించువారలెవరు?
అకట! కర్తల కన్నులకద్దుకొనుచు
కాలదన్నగ న్యాయంబె కర్తనిపుడు?

వెంక:- అరే దాసు, నోరుమూయి. నీసంభాషణచూస్తే తొండముదిరి ఊసరవిల్లైన చందంగా వున్నది. అరవై పన్నాల వేద మాపాడమస్తకం వల్లించిన నాముందేనా

నీవాగ్ధోరణి ఇకచాలించినీఉపన్యాసం, ఆ(త్రాగుబోతు విశ్వపతిముందర బయటపెట్టు. నీస్నేహితుడేగా? దొరి కారంతా పరమానందాయ శిష్యులు, దేశోద్ధారకులు.

(విశ్వపతి వెనుకనుంచి ప్రవేశించి వెంకటేశ్వరశాస్త్రి మెడ బట్టుకొని అటుఇటు జాడించి)

విశ్వ:- ఏమిటోయి పరమానందాయశాస్త్రిగారు. నీకుగూడా పిలక నిగుడుతున్నదా యేం? దవడకొయ్యలురాల్తాయి జాగ్రత్త.

వెంక:- లేదు. లేదు. కాదు. కాదండి. మిమ్మల్నికాదు. వదలండి. వదలండి. క్షమించండి.

విశ్వ:- రాస్కేల్. వెధవసంగినంగి వేషాలు, పిచ్చిపిచ్చిచేష్టలు చేస్తివా! జాగ్రత్త.

(వెంకటేశ్వరశాస్త్రి వెనుకకు తిరిగిచూచుకుంటూ బెదురు చూపులతో బోవును) (నిరంజనునిజూచి)

ఏరాదామూ? ఎక్కడనుంచి?

నిరం:- బాబూ. పెద్దయ్యగారివద్దనుంచివస్తున్నాను. సరేశాని అదేమిటిబాబూ? ఆ మొండి సత్తిని కుప్పకట్ట కట్టు కెళ్ళమన్నారని చెప్పింది.

విశ్వ:- అయితేదాన్ని యెత్తుకుపోనిచ్చావన్నమాట.

నిరం:- అదేందిబాబూ. అట్లామాట్లాడతారు? ప్రొద్దుటినుంచి మీకుఅది ఆపక్కవావులదొడ్డిలో రాచకార్యాలు

మాట్లాడుతూ కూర్చున్నారని పొలంపక్క యీరిగాడు చెప్పిమీరే ఇచ్చారనికూడ చెప్పాడు.

విశ్వ:- లంక్షీకల్లాలా, నీకునాడు, వాడికినీవ్రతోడు మీరంతా తోడుదొంగలు లేనిపోనివన్ని కల్పించడానికి, నోరు మూసికొని నీదారిన నీవ్రుపో. ఈనవసరపు వ్యవహారాలు నెత్తినపెట్టకుంటే చెప్తాగాలెక్కదీస్తా,

నిరం:- అయ్యగారికిచెలిస్తే బాగుంటుందాబాబూ ? నాకు మాటరాదూ! వాడు నన్నేఅడిగితే యేమిజవాబు చెప్పేది ? ఇదేనా మీబోటి పెద్దదొరలు చేయవలసిన పని ?

విశ్వ:- పోరా పిచ్చిగాడిదా నోరుమూసికొని. కూలివానికి నీకెందుకు ఈఅనవసర ప్రసంగం. అందులో మాలవాడివి కూడ- (అంటూ వెళ్ళిపోవును)

నిరం:- అయ్యో ! పంచమజాతి బ్రతుకెంత హీనంగానున్నది. దైవమా- పంచమునిపై నీకుగూడ దయలేదా ? వాడుకూడ నీబిడ్డడేకదా ?

ఉ॥ పంచముడంచులోకమున బల్మిగజాతురు నీచదృష్టితో,
బంచమజాతినేలను బ్రపంచములోనసృజించినావో ! మా
కుంచిరితావ్రుదూరముగ నూరికివెల్పలమాలపల్లె, నీ
పంచకునైన జేర్చుకొన వా ! మముపీడుటన్యాయమా
ప్రభో.

ప్రథమాంకము 2 వ రంగము (వీధి)

(వెంకటేశ్వరశాస్త్రి, విశ్వపతి, మోహన్)

మోహన్:- శాస్త్రిగారు! కొంచెం నశ్యం పెట్టండి.

వెంక:- అబ్బబ్బ. ఈనశ్యపుగోలతో చచ్చిపోతున్నాను కదా. మానలేకుండావున్నాను. ఈముష్టిముక్కలకు, బిచ్చపు ముక్కలకు, తిరిపెపు ముక్కలకు, యాయవారము ముక్కలకు, యాచనముక్కలకు, ఉపాదానముక్కలకు, అడుక్కునే ముక్కలకు, అర్థించే ముక్కలకు సమాధానంచెప్పలేక చచ్చిపోతున్నాను. ఎంతశుభ కార్యాలకు బయలుదేరినా, యేదోకొంపమునిగినట్లు పిలవడం. చేయిజాచడం. సిగ్గులేదు. శరంలేదు.

మోహన్:- ఓరినీదండకంకాలా. ముష్టి పొడుంకోసం ముప్పై మూళ్ళ దండకం వొప్పగించావు.

వెంక:- ఏం నీధర్మపు ముక్కలకు నాముష్టినశ్యమే కావలసి వచ్చెగా. ఇంకాబింక మెందుకు?

మోహన్:- శాస్త్రుల్లగారూ పిలిస్తేనే కోపమైతే యెట్లాగండి?

వెంక:- నాయనా! సంగతిసందర్భం అక్కరలేదా. ఏదోశుభ కార్యానికి బయలుదేరేటప్పటికి కొంప మునిగినట్లు పిలుపు. తిరిగిచూస్తే అరిచెయ్యి ప్రత్యక్షం.

మోహన్:- బాబూ, తమ బ్రాహ్మణార్థాలకుగూడా శకునాల పట్టింపేనటండీ ?

వెంక:- అంతేనా ఇకనాగతి. ఈవూళ్లో యెవరికి పెళ్ళిఅయినా వెంకటేశ్వరశాస్త్రి అధ్వర్యంలేని దొక్కటున్నదా ?

మోహన్:- అయితే ప్రస్తుతం వివాహ ప్రయత్నమా ? చెప్పరేం ?

వెంక:- అవునయ్యా. మురళీధరశాస్త్రిగారి కూతురువి లక్ష్మమ్మగారి కొడుక్కిచ్చేట్టుగా నేనే మాట్లాడ్డం. అదీ యిప్పుడే ప్రయత్నం. ఇదే సన్నాహం.

మోహన్ - అయితే విశ్వపతికివ్వరూ ?

వెంక:- విశ్వపతినిచూస్తే మామకునిట్టదు. (అటుఇటుచూచి) వాడు వట్టి త్రాగుబోతట. దొంగట. ఇవ్వన్నీ ఆయనే అన్నాడు. అందుకనే తనకూతునివ్వడట. ఈసంబంధం మాట్లాడమన్నాడు. ఇదిగో నీవు ఆలస్యం చేయిస్తున్నావు. నేనుత్వరగా వెళ్ళాలి.

మోహన్:- ఆలాగా. చెప్పవూ. ఇకజరిగినట్లే. మీబతుకులు సరిగాలేవు. పాముతో చెల్లాటం. విశ్వపతినియెరుగవు కాబోలు.

వెంక:- యెరుగకేం ? యేమిచేయగలడు ? నాపేరు వెంకటేశ్వరశాస్త్రి. తెలుసునా ? (ఇంతలో విశ్వపతి వచ్చు

చుండగాజూచి) అమ్మయ్యో. కొంపమునిగింది. (అని వెనుకకు తిరిగిచూస్తూ పరుగెత్తును)

విశ్వ:- మోహన్ ! శాస్త్రి అలాపరుగెత్తుతున్నాడేం ?

మోహన్:- నిన్నుచూచే (నవ్వుతూ)

విశ్వ:- ఎందుకు ? నేనేమిచేస్తాను ?

మోహన్:- దేహశుద్ధిచేస్తావేమోనని.

విశ్వ:- కారణంలేకుండానే ?

మోహన్:- కళ్యాణి పెండ్లివిషయంలో రాయబారిగా బోతున్నాడు. నీవు కొడతావేమోననేభయం.

విశ్వ:- ఎక్కడికి రాయబారం ?

మోహన్:- లక్ష్మమ్మగారి కుమారుడు భాస్కరరావుకిచ్చుటకు మామామగారు పంపుతున్నారు.

విశ్వ:- ఆ ! కళ్యాణి వివాహమా ! భాస్కరునకా !

చం॥ కటకట యెంతమాటవినగల్గియునోర్తును మేనమామయే,
కుటిలమనస్కుడై తనదుకూతుని నన్యులకీయనెంచుచో,
నెటుభరియింతు తాపమును నేవిధిబొందుదుసత్ఫలంబు నా
పటుతరశక్తిబూడిదల పాల్గద కార్యముమించిపోయినన్.

అయితే మోహన్ ! ముందు చేయబోయే కర్తవ్యం ఏమిటి ?

మోహన్:- ఏమిలేదు. నీవు కళ్యాణివద్దకుపోయి నీమనస్సు లోనివిషయం ఆమెకు తెలియజెయ్యి ఒప్పుకున్నదా సరే, లేదా అప్పుడే ఆలోచిద్దాం. కళ్యాణి యిష్ట పడితే ఆమెతండ్రి అడ్డుపడలేదుకదా!

విశ్వ:- సరే అట్లేపోతాను.

మోహన్:- ఒకవేళ యిష్టపడదూ. అప్పుడు మానడమేనా!

విశ్వ:- ఆ! కళ్యాణినిచేసుకోకుండా మానడమే. అట్లైనాదూ కాగూడదు.

మ॥ స్థిరవాసైకవిభూతిజీవనిచయ్రశ్రే యోద బాస్వత్ప్రభా
కర సీమాంతపరిభ్రమద్ఘనమహీ గర్భంబు గోడాగినన్
సరసీజేక్షణు బెండ్లియాడెదసుమీ! సత్యంబెకాకున్న నే
ర్వరినే! నాదగు పేరు విశ్వపతియే! భావింపనిప్పుండనే.

ఇదిగో ఇప్పుడే వెళ్ళివస్తాను.

ప్రథమాంకము ౩వ రంగము (కళ్యాణి గది)

(కళ్యాణి, విశ్వపతి, మురళీధరశాస్త్రి కీర్తన, హార్మోనియంమీదపాట)

కల్యా:- ఆహా! భాస్కరునికి నన్నిచ్చిచేయుటకై మానాన్న శాస్త్రిగారిని పంపాడు. నానోములుఫలించినవి.

చం॥ అసదృశరూపవంతుడు దయాహృదయుండు సమస్తజీవరా
శిసముడపార వాక్ఝరవిశేషుడు భూసురవంశజుండు ని

త్యసరళసత్యవాక్ప్రియుడు ధైర్యమనస్కుడు భాస్కరార్యు డే
బిసరుహానేత్రజూచి యవివేకము జెందును వానిగోరకన్.

విశ్వ:- కల్యాణి.
కల్యా:- ఎవరు ? నీవా ?
విశ్వ:- అవును. నేనే.
కల్యా:- ఏమిటి ? ఎందుకొచ్చావు ?
విశ్వ:- మామయ్య ఇంట్లోవున్నాడా?
కల్యా:- చూస్తే తెలుస్తుంది. ఎందుకో ?
విశ్వ:- ఊరికినే నీవుసరిగా సమాధానం చెప్పవేం ?
కల్యా:- ఎందుకుచెప్పను ? అయినా ఆడవాళ్ళతో పనేమిటి నీకు ?
విశ్వ:- నీతోపనుండే వచ్చాను.
కల్యా:- నాతోనా ? చెప్పు వింటాను.
విశ్వ:- మామయ్య ఇంట్లోవున్నాడా ?
కల్యా:- ఇప్పుడేకదూ చెప్పింది.
విశ్వ:- మనస్నేహం చిన్ననాటినుంచి ఉన్నది.
కల్యా:- ఆ. అయితే ?
విశ్వ:- అదికాదు మామయ్య నన్ను బాల్యమునుండి పెంచి చాడు.
కల్యా:- ఆవును. కాదన్న దెవరు ?

విశ్వ:- ఆయన నాచదువుకోసం డబ్బుకూడ ఖర్చుచేసాడు.

కల్యా:- అయితే. ఈస్వస్తివాచికాలన్ని యెందుకు ?

విశ్వ:- మనస్నేహం శాశ్వతంగా నిలబడాలి కల్యాణి.

కల్యా:- అంటే నాకు తెలియడంలేదు.

విశ్వ:- అదికాదు-ప్రేయసీ-

కల్యా:- ఆ. ప్రేయసినా ? ఇక మాటాడక వెళ్ళు. కలవరించ బోకు.

విశ్వ:- ప్రేయసీ, నాపై ప్రేమలేదా ! నీవులేకుంటే కళాశోభిత మైన నాబ్రతుకు అడవిగాచిన వెన్నెలేకదా, ఇంకనూ దాచడమెందుకూ

ఉ॥ ఏటికిమాటలిన్ని తరుణీవిను, నిన్వరియించినాడ, ము
మ్మాటికి నాదుమానసము మైకముగప్పదొడంగె, లేరునీ
సాటికివచ్చువారు సురసారసగంధులనైన, నింకనన్
బాటియొనర్చి, నిన్గవయు భాగ్యమొసంగుము మారు
బాణమా.

కల్యా:- విశ్వపతి. ఇంతకుముందేచెప్పాను నన్ను "ప్రేయసి" అనిపిలువవద్దని. ఇంకా అట్లాగే పిలుస్తున్నావు. అది నీకుతగదు.

తే॥ గీ॥ విశ్వపతి ! నిన్నువరియింప వేశ్యగాను
దుష్టజనులను గీర్తించు భ్రష్టురాల

గాను, కులకాంత, భూసుర కాంత జమ్మి
పోమ్మి కలనైనగోర నిక్కమ్ము నిన్ను.

విశ్వ:- కల్యాణి. ఇంతసాహసమునీకుతగునా! నీమేనత్త కొడుకునుగదా! నాపై మీనాన్నకుగల ప్రేమనీకు లేదా?

కల్యా:- లేకేమి? కుంటికూతలుమాత్రం నీవద్ద నున్నవనే ద్వేషంతప్ప.

విశ్వ:- ప్రేయసీ! నీపాణిగ్రహణమహోత్సవముచేత నన్నాదరింపజేయవూ?

కల్యా:- ఛీ నోరుమూయి. పాతికపదిమాట్లామాట అనకు. నోటికివచ్చినట్లుమాట్లాడక వచ్చినదారినపో. లేకుంటే మానాన్నతో చెప్పితినా?

విశ్వ:- (రోషముతో) ఆ. చెప్పియేమిచేయిస్తావు. మామ కూతురివికద.ఆమాత్రం కనికరం నామీదఉండవద్దూ నిన్ను ప్రేమించిన కారణంవల్ల నీ వెన్నిమాటలన్ననూ సహించవలసి వచ్చింది. గ్రామంలో నాప్రతాపం మీకు తెలిసేఉంటుంది. నీసౌందర్యం, నీముఖపద్మం, నీనడక, నీవొయారం—

మురళీ:- (ప్రవేశించి) నీబొంద. నీబోలె. వెధవ్రతాగుబోతు గాడిదె. నీకేమైన బుద్ధిఉన్నదా లేదా? నీతల్లి, దండ్రి చస్తే కూడుబెట్టే దిక్కులేకపోతే నీ మొఖానేస్తున్నాను. అడ్డగాడిదాలె ఉన్నావే, జ్ఞానంలేదూ. నీకుతోడు,

నీ బ్రతుక్కుతోడు నీ త్రాగుడుకుతోడు, పిల్లనివ్వాల్నా! నీజీవానపడి ఏడ్వటానికేనా? అపభ్రంసుడా? నీ మూలాన, ఊళ్లో నాగౌరవం నశించింది. నీ వెధవ చేష్టలవల్ల తలయెత్తుకొని తిరగడానికి సిగ్గేస్తున్నది. బ్రాహ్మణుడవైపుట్టి తాగి తందనాలెయ్యడమూ. సిగ్గు శరంలేదూ? ఈబ్రతుకు బ్రతికేకన్న నూతిలో పడి చావరాదూ?

విశ్వ:- నేనేమి చెయ్యలేదు మామయ్యా!

మురళీ:- ఏమిట్రా నీవుచేసేది? ఇందాకటినుంచి నీవాగుడేమిటి? నీమాటలు చెవినిబడే లేచివచ్చాను. ఇంకా మాట్లాడుతున్నావా? నీవు బాగుపడేరోజులేఉంటే మా అక్క బ్రతికిఉండేది. ఆమెపోబట్టే నీకీగతి పట్టింది. ఛీ! నీ మొఖంచూడరాదు. వెళ్ళిపో. మళ్ళీవచ్చావా కాళ్లు విరుగతయి.

(విశ్వపతి కోపంతో చూస్తూ పోవును)

---

# మా ల దా సు

## ద్వి తి యాం క ము 1 వ రం గ ము

(లక్ష్మమ్మ. వెంకటపతిశాస్త్రి)

(లక్ష్మమ్మ గోవిందనామాలు పాడుతూ వత్తులు వత్తుచుండును)

లక్ష్మ:- అప్పుడూ రావణుడు గోవిందారామ
సీత నెత్తుకుపోయె గోవిందా
రామ లక్ష్మణు లేడ్చిరీ గోవిందారామ
హనుమంతుడొచ్చెనూ గోవిందారామ।

వెంక:- (ప్రవేశించి) లక్ష్మమ్మగారూ!

లక్ష్మ:- ఎవరు? ఓహో, శాస్త్రిగారా! దయచేయండి.

వెంక:- అహా! ఏమిజన్మండిమీది? ఎప్పుడూ ఏదో పాటా పద్యమూ, భక్తి, వత్తులూ, ఎంత పుణ్యాత్మురాల వమ్మా?

లక్ష్మ:- ఆ. ఏమిటోలెండి. పెద్దదాననైనాను. ఇట్లా వెళ్ళి పోతే చాలు,

వెంక:- అమ్మా! అమ్మా! ఎంతమాటన్నారు? పదికాలాల పాటు భాగీరథివలె మీవంటివారుండబట్టే, మావంటి

వాళ్ళ జీవనాలు సాగుతుండడం, అబ్బాయి ఇంకా రాలేదండి పట్నంనుంచి ?

లక్ష్మ్మ:- లేదండి. పరీక్షలని నిన్ననే ఉత్తరంవచ్చింది. అవి పూర్తిచేసికొని తీరికగా వస్తాడట. ఏమిచదువులో, యేమిటో పెద్దదాన్ని, ఒంటరిగా కొంపలో ఉండట మంటే ఎంత కష్టమో చెప్పండి.

వెంక:- అయినా యింకా యింగ్లీషు చదువెందుకో చెప్పండి. పెద్దపెద్ద పరీక్షలు ప్యాసైనవారే చేసేపని చిన్నమెత్తు లేదు. అయినా మీకెందుచేతనోగాని పిల్లవాడిపెండ్లి చేద్దామూ, కొడకుకోడలు అనేముచ్చటే లేదేమండి,

లక్ష్మ్మ:- సరే, నామీదనే పెట్టారు ఆనేరం వాడే యీ బి.ఏ పూర్తిఅయితేనేగాని పెండ్లితలపెట్టవద్దంటే చేసేది లేక ఊరుకున్నానుగాని నాకుమాత్రం ముచ్చట్లు లేక నటండీ. సరికాని మీయెరుకన ఎక్కడైనా మంచి సంబంధాలు ంటే చెప్పండి.

వెంక:- అమ్మా. సంబంధాలు వెతకాల్నా . అందులో మీ అబ్బాయికి...

లక్ష్మ్మ:- అదికాదండి. గుణవంతురాలైన కోడల్ని వెతుక్కో వద్దండి. కోడలు నలుపైతే కులమంతా నలుపన్నట్లు మంచిచెడ్డ చూచుకోవద్దూ

వెంక:- ఎబ్బే. అంతదాకా యెందుకండి, మన అబ్బాయికి

కావలసినంతమంది కట్నాలిచ్చి పిల్లని కాళ్ళమీద పడేసేవాళ్లున్నారు. ఉంటేసరా. సాంప్రదాయం చక్కదనం, చదువు, సంపత్తూ ఉండవద్దూ,

లక్ష్మా:- మీకు తెలియనిదేమున్నది ? కాని యివన్ని ఉన్నవి దొరకవద్దండి,

వెంక:- అమ్మా, ఇలాంటివి కావలసినన్ని ఉన్నవి. మీకు నచ్చాలిగాని చూడండి, మన మురళీధరశాస్త్రిగారి అమ్మాయిని ఎరుగుదురుకదా! అంతకంటె మంచి సంబంధం మీరు ఎక్కడైనా చూచారా ?

లక్ష్మా:- నిజమేకాని వారికి మనం నచ్చవద్దూ

వెంక:- అమ్మా, అందులో సందేహంలేదు. ఆడపిల్లవారు పిల్లవాణ్ణి వెదుక్కోడంలో అనేక విషయాలు ఆలోచిస్తారు.

తే॥ గీ॥ చదువు, సంపత్తు, శీలము, చక్కదనము,
తెలివి, సాంప్రదాయము, కూర్మి, కులము, గుణము
కాయబల, మీడుజోడు, విఖ్యాతికలుగు
టరయుదురు తల్లిరో ! వరార్థులైనవా ॥

కాని మన అబ్బాయికంటె మంచి సంబంధం లేరని మాత్రం గట్టిగా చెప్పగలను. నిజంగా మీకా అభి

ప్రాప్తం ఉన్నదంటే నేను వారిని మీావద్దకు వచ్చేటట్టు చేస్తాను.

లక్ష్మ్మి:- మీారంతవారే కాని మా వాడికికూడా యిష్టంఉండవద్దండి. వాడు సెలవుల్లో వచ్చినప్పుడల్లా పిల్లను పల్కరించి సవ్విస్తుండేవాడు. కాని వివాహం విషయంలో యేమంటాడో ?

వెంక.- అమ్మా ! ఈకాలపు పిల్లల సంగతి మీాకు తెలియదు నన్ను అడగండి, నేను చెప్తాను. తనకు ఇష్టంలేనిదే ఆ అమ్మాయిని ఎందుకు పలుకరిస్తాడు ? ఇష్టంలేనిది ఆ అమ్మాయి యెందుకు నవ్వుతూఉంటుంది? మొత్తంమీాద మీాఅవశిష్టమే అన్నమాట. అదిగాక ఆయనకు ఒక్కతే కుమార్తె. ఆస్తంతా ఆ అమ్మాయిదే. ప్రస్తుతం యేదో లాంఛనాలని ఏదో కొంచెంగా రెండువేల వరకు ఒప్పుకుంటే, తర్వాత అంతా మనదే.

లక్ష్మ్మి:- సరే మీాకు చెప్పేదేముంది ? అబ్బాయికూడ పరీక్షలు కాగానే వెంటనే రమ్మని ఉత్తరం వ్రాస్తాను.

వెంక:- చిత్తం స్థిరమైనట్లేనని యెంచండి. వెళ్ళివస్తాను. మరి నన్ను మాత్రం మరచిపోకండి !

లక్ష్మ్మి:- ఎంతమాటన్నారు ? అదివేరే చెప్పాలా ?

---

ద్వితీయాంకము 2వ రంగము

(సోమంభొట్లు, ఈశ్వరంభొట్లు)

సోమం:- ఈశ్వరంభొట్లూ! ఈమధ్య నీదర్శనాలు లేవేం?

ఈశ్వ:- దర్శనాలు వల్లకాదు. క్షణంతీరిక లేదూ దమ్మిడీ ఆదా లేదూ.

సోమం:- అంతతీరికలేకుండ యేమిచేస్తున్నావోయి నాతండ్రి!

ఈశ్వ:- ఏదో పావలా డబ్బులు సంపాదించుకోకపోతే సంసారంగడిచే విధమేలా? సంసారం సాగరంఅన్నారు పెద్దలు.

సోమ:- దర్భపోట్లు బాగాతగులుతున్నయ్యా?

ఈశ్వ:- ఆదర్భపోట్లే లేకుంటే నీబ్రతుకు నాబ్రతుకు బయట పడేది. చెప్పను మరచిపోయాను. దర్భపోట్లంటే జ్ఞాపకం వచ్చింది. ఈసంగతి విన్నావా సోమం.

సోమ:- ఏం సంగతి?

ఈశ్వ:- మన కేశవశాస్త్రి పాపరాజుగారింటికి వెళ్ళి అన్నంతిని బ్రాహ్మణార్థానికి పోయినాడట. అది వారికి తెలిసి వానిని బాగా చావగొట్టి చెవులు మూసారట.

సోమ:- వాడి కదేంరోగంమరి. ఇట్లా చేయడంవల్లకాదూ బ్రాహ్మణ జాతికి అనర్థకం చుట్టుకున్నది. బ్రాహ్మణు

డంటే గౌరవం ఉన్నదా ఇప్పుడు. అదిలేకపోగా ఆ శబ్దం విన్నంతమాత్రాన వచ్చే ఉద్యోగాలుకూడ వెనక్కి పోతున్నాయి. మనఊరి మాలపల్లెలో నిరంజ నాయి బోధ జాస్తిగా ఉన్నది. మాలపల్లె యెదురు తిరిగేట్టున్నది.

ఈశ్వ:- వాడి సిగ్గోసిరి. ఇంకొక సంగతి. లక్ష్మమ్మగారి కుమార్తె పెళ్ళి.

సోమ:- ఎప్పుడు ?

ఈశ్వ:- ఈ మాసంలోనే. ఇంకా లగ్ననిశ్చయం కాలేదు.

సోమ:- పిల్ల ?

ఈశ్వ:- ఆ. మన పెద్దశాస్త్రిగారి కుమారై. నీవీప్రపంచంలో లేవే ?

సోమ:- నేను వినలేదోయి ఆ సంగతి. ఆలాగా ఉభయులూ బాగా వున్నవాళ్ళే అయితే మనసంభావన ఒకతులం తక్కువ లేదన్నమాటే ?

ఈశ్వ:- ఒకటేంకర్మం. రెండు వైపుల రెండు తులాలకు తగ్గవు.

సోమ:- బాగున్నది. ఆమాత్రం రోజూఉంటే మన భరాటు సాగినట్లే. లేక గాని మనసంపాదనే రెండుతులాలుంటే ఆకాశంలో నక్షత్రాలు పొడిపించం. ఏమిచేస్తాం.

కాని మన అదృష్టం ఇలా ఉన్నది. ఏమి చేస్తాం. మొన్న బందరు పెళ్ళికి చావు బ్రతుకులతో ఆశపడి పదిమైళ్ళు పరుగెత్తితే పెళ్ళివారొక నక్షత్రం సమర్పించారు. ఎన్నినక్షత్రాలతో కడుపునిండుతుంది ఈ శ్వారం?

అదీనిజమే. మన పెద్దలిచ్చిపోయిన ఆస్తులున్నాయి కాబట్టీ కాళ్ళుముడుచుకుని కూచోను! తెక్కలమీద జీవనాలు.

అంతేలే. నరొకసంగతి మరచిపోయాను. ఏమిటి మొన్న రామయ్య నాయుడుగారింట్లో గలాభాజరిగింది?

అదా. అదొకచిన్న నాటకం. పెళ్ళిసంగతి దేవుని కెఱుకగాని నేనుమాత్రం ప్రాణంతో బయటపడ్డాను. లేకుంటే వీపు మద్దెలమోత మోగేది.

ఏదో గొప్ప విషయమేనే?

నాయుడుగారి కూతురు పెండ్లి చేయిస్తూ లగ్నంవేళ వధువు మెళ్ళో మంగళసూత్రం కట్టించడం మరచిపోయినాను. పెళ్ళిపెద్దలు నాకన్న మించినవాళ్ళు. తర్వాత నాకు రాత్రి జ్ఞాపకంవచ్చింది నిజంగా ఆ భగవంతుడే ఉపాయం చూపకపోతే కొంప గుటుక్కున మునిగేది?

ఏం చేసావో? ఏదో యుగంధరాలోచనలాగున్నదే!

ఈశ్వ:- మరి తప్పించుకొనేవిధం చూచుకోవద్దూ. ఆరాత్రి మెల్లగా పెళ్ళికూతురు పడుకున్న గదికి వెళ్లి ఆచీకటి లోనే నే ముడి వేసి వచ్చాను.

సోమ:- అదీ తెలివి? అంత ప్రజ్ఞ ఉండబట్టే నిగ్గుకొస్తున్నావు.

ఈశ్వ:- కాదోయి, సాంతంవిను. తెల్లవారి చూస్తినికదా, ఆమంగళసూత్రం పెండ్లికూతురి అమ్మమ్మ ముసలి ముండ మెళ్ళో ఉన్నది.

సోమ:- హ్వా! హ్వా! హ్వా! తర్వాత!

ఈశ్వ:- ఇంతకూ మన రోజులు బాగున్నాయి. అప్పుడు వారి చుట్టాలు పక్కాలు పోగయి పాపం ఆముసలమ్మనేమి చీవాట్లు పెట్టినా పెట్టారు.

సోమ:- ఆమెనెందుకు పాపం.

ఈశ్వ:- ఎందుకా? ఆమె పిల్ల మెళ్లోనుంచి తీసికొని కట్టుకున్నదని వారనుకున్నారు.

సోమ:- భలేపనిచేసావు. నీకు దేహశుద్ధి కాలేదుకదా?

ఈశ్వ:- ఓరి నాగన్న. అంతదాకారానిస్తాను. ఎక్కడికి వెళ్లినా జయించిరాగలను. ఈశ్వరంభొట్లు. సామాన్యుడనుకున్నావా?

సోమ:- నేనేనా సామాన్యుణ్ణి? నీకన్న తక్కువ తినలేదులే.

మొన్న గోవర్ధనంచౌదరిగారింట్లో శాస్త్రోక్తంగా ఆంజనేయ దండకంతోను, లక్ష్మీస్తోత్రంతోను, రెండు దాశరథీశతకంలోని పద్యాలతోను కర్మ అవిఘ్నంగా పూర్తిచేయించి వచ్చాను.

ఈశ్వ:- అపరకర్మే, సరే అట్లయితే నాకు తీసిపోవు. మురళీధర శాస్త్రిగారింట్లో కన్పించి వద్దామా? రేపు పెళ్ళిలో శాస్త్రోక్తూస్తో ముట్టాలిగాదూ మనకు,

సోమ:- అలాగే పద.పోదాం. ఎందుకు వచ్చిన స్వస్తి?

ఈశ్వ:- హారేరామ హారేరామ! రామరామ హారేహారే!

సోమ:- హారేకృష్ణ హారేకృష్ణ! కృష్ణకృష్ణ! హారేహారే!

(నిష్క్రమింతురు)

---

ద్వితీయాంకము                    1వ రంగము.

(నీరం, మురళీ, భాస్కర్, సోమ, ఈశ్వ, విశ్వ)

నీరం:- దేవా! నన్ను ఆపదనుండి కడతేర్చవా!

తే॥ గీ॥ దిక్కులేకను గొనుచుండు పొక్కుచున్న
కనికరముజూప జనకుని కార్యముగద

మాలడంచును దలపోసి మమునకయ్య
భక్తులనుబ్రోవ నీయదె భారమయ్య!

మురళీ:- (నిరంజనునిజూచి) ఏరా దాసూ! నిన్ను నమ్ముకుంటే బాగు పక్షట్టే ఉన్నది. నీకు చెప్పడంకంటె కొరివితో తల గోక్కోడం మంచిది. ఎక్కడికి వెళ్లావో తెలియదు! నేనివ్వాళ పొలం రాకపోతే చేలువీటుబోయేది కదా. పనిలోకి రానివాడవు రానన్నైనా చెప్పివేడవ రాదూ! ఏదో ఒకటి తెలిసి ఉంటుంది.

నిరం:- కాదు దొరా. ఇవ్వాళ గొప్ప అవస్థలో చిక్కుకున్నాను. మీరాకు కాపాడుతారని గంపెడంత ఆశతో వచ్చాను.

మురళీ:- ఊఁ! అదికూడానా? వల్లకువచ్చి ముంత దాచడమెందుకు?

నిరం:- బాబూ. మాకుఱ్ఱవాడికి చాల జబ్బుగా ఉన్నది. మూడు రోజులనుంచి ధారకం లేదు. నిన్న నుంచి స్పృహలోగూడ లేదు. చాల బలువుగానే ఉన్నది. వైద్యుని మందివ్వమని బ్రతిమాల్తే మందుకు రెండు రూపాయలు తెమ్మన్నాడు. గొంతు కోసుకున్నా నావద్ద రాగిదమ్మిడీ లేదు. బాబూ ఆ సహాయం చేయండి.

మురళీ:- రెండు రూపాయిలు తెమ్మన్నాడుగా. వాడి మొఖం.

ఓరి పిచ్చోడా! రోగిని వైద్యుడు బ్రతికించగలడా అలా బ్రతికించే శక్తి వైద్యునికుంటే వాడెందుకు చస్తు న్నాడు. తన్ను తాను బ్రతికించుకోలేని వా డితరుల నెలా బ్రతికిస్తాడు? దీనినిబట్టి చూస్తే వైద్యం బూటకం గా కన్పడుతున్నది. మృత్యువనేది వేరొకటున్నదా? అది వాడివాడి కర్మను అనుసరించి ఉంటుంది. ఇదే మానవ జీవితంలో ఉండే రహస్యం. చూడు మెరక చేలో నీళ్లుపెట్టమని చెప్పి మూడు రోజులయింది. ఏంపెట్టావో ఏంపాడో!

నిరం:- పెట్టానుగాని స్వామీ. నాకు ఒక్కడే పిల్లవాడు. పసికూనడు. తల్లిలేని బిడ్డడు. కన్నప్రాణం నిలుస్తుందా? ఆశ అనేది ప్రతివారికీ ఉంటుందికాదూ! కటాక్షించండి.

మురళీ:- అరే! తెలియక నీబోటి బుద్ధిహీనులంటే అది సిద్ధాంతమవుతుందట్రా! వెళ్లు. వెళ్లు. అదే నయమవుతుంది లే. పడమర పొలం వెళ్ళి చూచిరా. ఆసూరయ్య గండి తీసాడటగా!

నిరం:- వెళ్లుతానుగానిబాబూ, ఒక్కరూపాయి అయినా దయచేయండి. అదివైద్యునికిచ్చి కాళ్లుపట్టుకుంటాను. ఏవిధంగానైనా నాకుమా వాణ్ని రక్షించమని వేడుతాను. అనుగ్రహించండి. ఒక రూపాయిచాలు.

మురళీ:- ఇంతకుముందే చెప్పలేదా డబ్బులేదని. రూపాయ గీపాయి, రూపాయిలు పండించే చెట్టు నాదగ్గర ఉన్న దనుకున్నావాయేం? వెళ్ళిచెప్పినట్లు పొలంపో, పొలం పనులు బాగా సాగటంలేదు. అది పండకపోతే, మన అందరినోట మన్నే. కూలివాడి మాదిరిగా గాకుండ నీ స్వంతపనిగా భావించి పనిచెయ్యాలి. తెలిసిందా?

నిరం:- దొరగారూ. మీరట్లా సెలవిస్తే నే నేమని మనవి చేయగలను? కడుపుతీపి యెవరికైనా ఉండేదేకదా? అదిగాక నాకు వెనకాముందు వాడొక్కడే గతి. వాణ్ణి చూచుకొనే నేను ఇలా బ్రతుకుతున్నాను. నా యీ కాయకష్టము అంతా వానికోసమే. నడి సముద్రంలో మునిగి ఉన్నాను లేకపోతే నాకీపూట సెలవైన యిప్పించండి.

మురళీ:- సెలవూ నీకుసెలవిచ్చి నాచేలు పాడుపెట్టుకోన మనేనా నీ భావన!

నిరం:- కాదు బాబూ. ఒక్కపూట సెలవిస్తే, యేబాబు కాళ్ళైనా పట్టుకొని మందోమాకో చూచుకోడానికి, అంతే! అందుకోసమే బాబూ! కనికరించండి, బీద వాణ్ణి, ఒంటరిగాణ్ణి, నడి సముద్రంలో ఉన్నాను. దిక్కూ దోవా కన్పించడంలేదు. ఆమాత్రం సాయం చేసారంటే...

మురళీ:- ఇకచాలు. నోరుమూయి. పోయి పనిచెయ్యి. ప్రతి దినమూ యేదో వంకపెట్టుకొని వస్తావు పని చెయ్యవు, పాడూ చెయ్యవు. ఏనాకు చెప్పకపోతే మీకు త్రాగడానికి యెక్కడనుండి వస్తుంది? నీవు చేయక పోతే నీతాతవచ్చి చేస్తాడా? తక్షణం వెళ్ళి పనిలోకి దిగు. నిలబడకు. వెళ్లు. ఊ! త్రాగడానికి అంతా దొంగవేషాలు!

నిరం:- రామరామ? నే నెన్నడైనా త్రాగానా? తినడానికే లేదే! పైగా త్రాగడంకూడానా? నేను త్రాగుతా నని యెవరికైనాఅనమనండి వన్నునొప్పించడానికి దేనా సమయం స్వామీ? నేను మీసేవకుణ్ణి, మీదాసుణ్ణి. మీరుతప్ప నాకు వేరే గతిలేదు. నాకీ గండం తప్పిం చారా నాచర్మం చెప్పులుకుట్టి యిస్తాను. ఎల్లకాలమూ మీరు పుత్రభిక్ష పెట్టారని మీపేరు చెప్పుకొని బ్రతుకుతాను. మీరాదుకోకపోతే నాగతి అధోగతి, రక్షించండి, బాబూ రక్షించండి.

మురళీ:- త్రాగకపోతే ఇంత వాగుడెందుకురానీకు, వొళ్లు తెలిసే మాట్లాడుతున్నావా? త్రాగడానికి అన్నీ దొంగవేషాలు.

నిరం:- అయ్యా. మీరెట్లా భావించినాసరే, నాకు త్రాగుడలవాటు లేదు. ధనమున్నవారెలా గున్ననూ తప్పులేదు. అన్ని తప్పులు మాబోంట్లకే కదా.

సీ॥ ఖూనీలుచేసినా ? కొంపలుతీసినా ?
ధనవంతులకెచెల్లు ధర్మమదియె !
ఊళ్ళేలినా ? దురుద్యోగాలు చేసినా ?
ధనవంతులకెచెల్లు తత్త్వమదియె
త్రాగుళ్లు త్రాగినా ? తందనాలాడినా ?
ధనవంతులకెచెల్లు దారియదియె!
ఐ. పీ. లు పెట్టినా ? పాపరై పోయినా !
ధనవంతులకెచెల్లు తగువులేదు

తే॥ గీ॥ ఎన్ని నీచకృత్యములు గావించుచున్న;
భువిని ధనవంతులకె చెల్లిపోవుగాని
నిర్ధనున కెట్లు చెల్లు అన్నియునుధీర
వృద్ధనారి పతివ్రతా యనుట వినమె!

మురళీ:- (కోపముతో) ఓరి మాలముండాకొడకా ! మమ్మల్ని ఎక్కిరిస్తావా ? అంతపొగరా గాడిదె. (అంటూ నిరంజనుని కొట్టును)

నిరం:- బాబూ. కొట్టకండి. కొట్టకండి. అయ్యో. బాబూ - బాబూ...బాబూ...(అని పడిపోవును)

మురళీ:- (నిశ్చేష్టుడై) వీడు చచ్చిపోయినాడా యేం? (అంటూ అటుయిటుచూచి పారిపోవును)

భాస్క:- ఇదేమిటి ? ఎవరితను ? (బాగుగా పరిశీలించి నోట నీరుపోసి ఉపచారము చేసిన పిమ్మట)

నిరం:- అమ్మ అబ్బా...(లేవబోవును)

భాస్క:- ఎవరయ్యా నీవు? ఎందుకిలా పడిఉన్నావు? ఇదేమిటి యీ దెబ్బలు.

నిరం:- (లేచి) అబ్బా. ఎవరు? భాస్కరయ్య పంతులుగారా? బాబు దండాలు. నాకొడుకు బ్రతికేఉన్నాడా? వేగిరం చెప్పండి. అయ్యో. పలుకరేం బాబూ.

భాస్క:- కొడుకా? కొడుకేమిటి?

నిరం:- స్వామి. కొడుకు...నాకొడుక్కు జబ్బు (అని చెప్ప లేక పోవును)

భాస్క:- దుఃఖించకు నాయనా. నీకొడుక్కు జబ్బుగా ఉన్నదా!

నిరం:- అవును బాబూ. ఏమి చెప్పేది నాఅవస్థ? ఎవరికి చెప్పు కొని మొత్తుకొనేది?

భాస్క:- చెప్పునాయనా. విషయం ఏమిటి?

నిరం:- బాబూ నా కొడుక్కు చాల జబ్బుగా ఉన్నది. బ్రతుకుతాడనే ధైర్యంలేదు. వైద్యుని మందివ్వమని బ్రతిమాలితే రెండు రూపాయలు తెమ్మన్నాడు. నావద్ద చిల్లిగవ్వయినాలేదు. మాకామందు గాబు గార్ని ఒక్కరూపాయి అయినా చివరకు ఒక్కరోజు సెలవైనా యివ్వమని ప్రార్థించాను. కాళ్లమీద పడ్డాను. ఏమిలాభం?

భాస్క:- ఒప్పుకోలేదా?

నిరం:- ఒప్పుకోకపోతేమానె; తిట్టి మీదపడి చావగొట్టారు. వారిచ్చిన బహుమానం ఇదే బాబూ!

భాస్క:- ఎవరు మీకామందు?

నిరం:- (సంశయించుచు)

భాస్క:- సంశయించకు. అసలు ఎవరునీవు?

నిరం:- నేనా! నేను పంచముణ్ణి బాబూ. నాపేరు నిరంజన దాసు.

భాస్క:- అ. అయితే?

నిరం:- మా కామందు మురళీధరశాస్త్రిగారు. ఆయనగారితో నాఅవస్థ చెప్పుకొని నాకీయవలసిన కూలి డబ్బుల కోసం వెళ్లి మొరపెట్టుకొన్నాను. డబ్బీయకపోతే ఒకరోజు సెలవైనా దయచేయండని బ్రతిమాలాను. కడకు ఇదీ ఫలితం; ఈవిధంగా ఉన్నది మా బ్రతుకు.

భాస్క:- (స్వగతము) ప్రజాస్వామిక ప్రభుత్వంలో గూడ ధనవంతుని స్వార్థానికి, అధికార వ్యామోహానికి అంతులేదు. హద్దులేదు (ప్రకాశముగా) దాసూ ముందు నీగతి విచారించుకో, నీబిడ్డకు మందిప్పించే యేర్పాటు నేనుచేస్తాను. పైన పరాత్పరుడున్నాడు. ఆపాటి దయ కలగదా? పద పోదాం -

నిరం:- స్వామీ. మీరు నన్ను తాక్కండి. మీరు బ్రాహ్మణులు. నన్ను తాకితే మైలపడతారు.

భాస్క:- (నవ్వి) దాసూ, ఇప్పుడు నావంక చూడు. నాకేమి మైల సోకింది.? పూర్వంకంటె నేనేమైన ముఱికిగా నున్నానా? లేక చెడిపోయినానా?

నిరం:- మీ బ్రాహ్మలు మిమ్మల్ని కష్టపెడతారేమో బాబూ.

భాస్క:- బ్రాహ్మలు. బ్రాహ్మలూ పంచములూ. దయా దాక్షిణ్యంగలవాడే బ్రాహ్మణుడు. అవిలేనివాడే పంచముడు. నిజమైన బ్రాహ్మణ్ణి నీవేమి ఎరుగుదు వోయిదాసు. నిన్ను తాకినంతనే చెడిపోయే బ్రాహ్మణుడు గాలికి చెడిపోడా? ధూళికి చెడిపోడా? స్వచ్ఛమైన బ్రాహ్మణుడెప్పటికిని చెడడు. నీవేమి భయపడ నక్కరలేదు. పద.

నిరం:- (కాళ్ళమీదపడి) స్వామి. నిజమైన బ్రాహ్మణ్ణి యిప్ప టికి చూడగలిగాను. అందరూ యిలా ఉంటారా? మీపాదధూళి ధరించుకొని నేను పవిత్రుడనవుతాను.

## కీర్తన

దాత వీవె ఆహా । ప్రాణ॥
అ॥ వెతదీర్చినావె నా । వేల్పువిక నీవేగద
చ॥ మతవైషమ్యత ప్రబలెను నేడు।

సుంతయుడలపదు పోదరులంచు।
ప్రాత చరితునిను భాదింతురేమో।
ఏతీరుననిక । యీశుడుగనునో ॥ దాత॥

భాస్క:- దాసూ. లే. భయపడకుపోదాం. (అని లేవదీయు ఇంతలో సోమం,ఈశ్వరం, విశ్వపతి ప్రవేశింతురు. గుసగుసలాడ ప్రారంభించి)

విశ్వ:- (త్రొక్కుతూ) కులభ్రష్టుడు - బ్రాహ్మణుడు - మాలవాణ్ణి తాకుతున్నాడు బ్రాహ్మణుడట. బ్రాహ్మణ కులం ఎంత గొప్పది. అలాంటికులం నాశనం చేస్తున్నాడు. సదాచారాలు మంటకల్పుతున్నాడు.

సోమ:- విశ్వపతిగారూ! ఈయన నేగదూ మీ కల్యాణమ్మ గారి భర్త.

విశ్వ:- వాడుకాదు నీవు. వాడు కల్యాణమ్మ భర్తగాదు. నీభర్త, భడవా! ఇంత ప్రయోజకుడు విశ్వపతిశాస్త్రుర్ల గారి యెదుట నేనా యీమాటలు.

ఈశ్వ:- సోమంభొట్లూ, విశ్వపతిశాస్త్రిగారితో నేనా నీవు మాట్లాడేది. (విశ్వపతిని జూచి) అయ్యా. క్షమించండి. ఇతను వట్టి చాదస్తుడు. తెలియకన్నదానికి కోప్పడకండి. కాని చూచారుకదూ ఆభాస్కరరావును. అతని విషయమై మీరుకొంచెం శ్రద్ధవహించాలి, లేకపోతే కులమంతా చెడిపోతుంది సుమా!

ఆమాటన్నావు బాగున్నది. మీరు బుద్ధిమంతులు. ఇదుగో, పెళ్లి కాఫీఖర్చాగిరండి (అని చెరిఒక బేడ యిచ్చి) కాని మామామతో చెప్పి వాడ్ని వెలివేయించండి. అప్పుడు రోగం బాగ కుదురుతుంది. నాకు కూడ సాయంచేసిన వాళ్ళవుతారు.

అయ్యో, ఇంతకంటె కావలసిందేమిటి పదండి. పోదాం. పోయి శాస్త్రిగారితో జెప్పి పీడీఅంతు కనుక్కుందాం. (అందరు భాస్కర నిరంజనుల నురిమి చూచి వెళుతూ)

హరేరామ హరేశంభో, రామశంభో హరేహరే।
హరేశంభు హరేకృష్ణ, శంభుకృష్ణ హరేహరే।
ఒక్కదెబ్బకూ, రెండుపిట్టలూ హరేహరే
శాస్త్రి కూతురు మీకు, కావడం సరేసరే।
ఒక్కతులము పై మాకు రావడం మరేమరే॥

(నిష్క్రమింతురు)

ద్వితీయాంకము 4వ రంగము

మురళీధరశాస్త్రిగారియిల్లు

(కల్యాణి, మురళి, సోమం, ఈశ్వరం, లక్ష్మయమ్మ) (కల్యాణిపాట పాడుతూ వుంటుంది)

కీర్తన

కల్యా:- నాజన్మమే ధన్యమాయెనుగదా! నాభోగభాగ్యములు పండెను గదా!

కోరినవరుడే, చేరువనుండెను – కోరికదీరెను నా నోములు పండెను ॥నాజన్మ॥

పతిఘనుడైనను – సతికదిదివియే!
పతివిహీనుడైనా – అదియే నరకము కాదా సతికి ।
॥నాజన్మ॥

మురళి:- (ప్రవేశించి) ఎందుచేతనో నాకు శరీరం అస్వస్థత యేర్పడుతున్నదమ్మా. అందుచేతనే త్వరగా నీవివాహం చేసి చూచి సంతోషించితినా, యీనాజన్మ ధన్యమైనట్లే. తర్వాతనా, సంతోషంగా, అనాయాసంగా ప్రాణంవిడుస్తాను.

కల్యా:- ఛీ ఛీ. నాన్నగారు! ఏమిటలా ఓగాత్యపుమాట లనుకుంటారు. నాకు మీరేతల్లి. మీరేతండ్రి.

మీకంటె నాకు వెనకాముందు దిక్కులేదు. మీరే యిలాంటిమాటలంటే నాకు దిగులేస్తుంది. నా పెండ్లి సంగతి తర్వాత చూసుకుందాం. ముందు మీ ఆరోగ్యం చూచుకోండి.

మురళీ:- అదికాదమ్మా. నాకు శరీరారోగ్యం తప్పింది. మునుపటి పాటవం లేదు. అందుకనే ఈసంబంధం విచారించాను. ఇక ఎంత కష్టపడ్డ ఇంతకంటె మంచి సంబంధం దొరకడం కష్టమమ్మా. నీవుకూడ యిష్టపడ్డట్టే తెలిసింది. కనుక యింతగా నీయెదుట చెప్పుతున్నాను.

కల్యా:- అబ్బా, పోనిస్తురు! మీఆరోగ్యం ముందు చూచుకోండి నాన్నగారూ.

(సోమం, ఈశ్వరంభొట్లు ప్రవేశించగా కల్యాణి లోనికిపోవును)

ఈశ్వ:- శాస్త్రిగారూ. (అని వాకిట్లోనుంచి కేక)

మురళీ:- రండోయి లోపలికి. సోమంభొట్లూ! శెలవేంలాగా లేదోయి.

సోమ:- శరీరంసంగతి దేవుడెరుగు. ముందు మీ మీదవచ్చే అపాయాన్ని ఆలోచించండి. నిరంజనాయుని మీకు చావగొట్టారట. మన అత్తామ్మాయమ్మగారి కుమారుడు భాస్కరరావు, అంటేమీకు కాబోయ్యే అల్లుడు

వానికి నానా ఉపచారాలు చేసి, తాకి, పట్టుకొని లేవదీసి వాళ్లింటికి తీసుకొని వెళ్లాడు. ఈసాయంత్రం లోగా మీరా మీద చార్జిగూడ పెట్టిద్దామనుకుంటున్నాడని ఊళ్లో ప్రకాశంగా నున్నది.

మురళీ:- అతనెప్పుడు వచ్చాడు? ఊళ్లో లేడే?

ఈశ్వ:- ఇంతకుముందే వచ్చే దారిలోనే జరిగిందటండి. ఇంటికిగూడా వెళ్లకుండా ఈ వ్యవహారంలోకి దిగాడు. అయినాగానీ యెంత ఇంగ్లీషు చదివినా, మాలవాణ్ణి తాకడం, వాడికి అక్షమైన చాకిరీ చెయ్యడం మాల పల్లెలోకి వెళ్లడం జరిగినతర్వాత ఇక బ్రాహ్మణుడంటే ఒక్కడికి గౌరవం ఉంటుందా? ఇకఎందుకైనా పనికివస్తామా చెప్పండి?

మురళీ:- అరే. అంత నీచుడటోయి భాస్కరుడు!

సోమ:- బాబూ. ఒక్కటి చూడండి. నిరంజనుడు మీనౌకరు. మీరెన్నోసార్లు వాణ్ణి కోప్పడ్డారుకాదూ. వాడేదో వొంగత్తువేసి పడిపోతే ఎవరికెరుగరు? ఈయనే పెద్ద న్యాయకర్తవలె వానిచేత మీమీద చార్జిపెట్టిస్తున్నాడంటే, ఇక ఆయన యోగ్యత, ఆయన జ్ఞానము విచారించండి.

మురళీ:- సోమంభొట్లు. చాలఫారపాటు పడ్డానోయి. చదువుకుంటున్నవాడు, మంచివాడు, ఏదో పనికివచ్చే

వాడు అని మా అమ్మాయినిచ్చి చేయదలచాను. చాల పొరపాటు జరిగేది.

ఈశ్వ:- అదిసరే. ముందిది విచారించండి. మీమీదనే చార్జి పెట్టి తామేమి చేయదలచారు? ఈ ఊళ్లో మీవంటి వారుండబట్టే ధర్మం ఇంకా యిలా ఉండడం మా వంటి వాళ్లు తలలెత్తుకొని తిరగడం. మీకే ఆపత్తు తటస్థిస్తే యిక-

సోమ:- ఈశ్వరంభొట్లూ! నీకు పిచ్చా? వెఱ్ఱా? చార్జిపెట్టించి ఈ ఊళ్లో నిభాయిస్తాడుటోయి. ఇక వాళ్ళింట్లో బ్రాహ్మణుడైనవాడు ఉదకం పుచ్చుకుంటాడా? ఈ భాస్కరుడేమౌతాడో, ఆ నిరంజనాయి ఏమౌతాడో, ఆలోచించు. ఇంతకూ శాస్త్రిగారికి ఆమాత్రం పట్టుదల కలగాలి గాని-

మురళీ:- భొట్లూ, వినండోయి. ఇంతకు వచ్చినతర్వాత ఇక దాచడమెందుకు? వినండి. ఇక వాళ్ళ సంబంధం నేను చేయడం కల్ల. రేపటినుంచి వాళ్ళకు వెలి. మన బ్రాహ్మణ్యంలో ఎవ్వరూ వాళ్ళింటికి వెళ్ళగూడదు. మీరందఱు ఒకకట్టుగా నామాటకు లోబడిఉండండి. ఈ శాస్త్రి శక్తి యేమిటో చూద్దుముగాని-

ఈశ్వ:- నిజమేకాని మీకేమి భయములేదు. మావంటి వాళ్లకుమాత్రం-

మురళీ:- ఇక ఆపవోయి భాస్కరా. నేనున్నాను. ఇక నేమైనా సరే, ఎన్నికష్టాలు వచ్చినాసరే, ఆభాస్కరుని సాధించి తీరాలి. మీరు వెళ్ళి మన నలుగురి యిళ్ళ లోను చెప్పి కట్టుదిట్టం చేయండి. మీ తరపున నేను న్నాను.

సోము:- సరేమీ ఆజ్ఞ. ఇక తప్పుతుందా? (అంటూ వెళ్లుదురు)

కల్యా:- (ప్రవేశించి) నాన్న ఏమిటిజరిగింది? ఏమిటి వాళ్లు చెప్పేది? మీరేమి చేయబోతున్నారు?

మురళీ:- (కోపంతో) ఏమిటా? నేను జైలుకు పోతున్నాను. జరిమానాలు చెల్లించ పోతున్నాను. చివరికి ఈ మురళీధరశాస్త్రి గతి అంతవరకూ వచ్చింది. చూస్తాను.

కల్యా:- ఏమి చూస్తారు నాన్నగారూ. నామాటవినండి. తొందర పడకండి. వీళ్లువచ్చి యేమేమో చెప్పి మీ మతి పోగొట్టినట్లున్నారు. నిదానించండి. ఆలో చించండి.

మురళీ:- ఏమిటమ్మా ఆలోచించేది ఇంకా? భాస్కరుడట - నాకట - శిక్ష వేయిస్తాడట - చాలు. ఇంతవరకు మర్యాద విచారించినందుకు ఇప్పుడే తెలిసింది. ముందే మేలుకున్నందుకు సంతోషం.

కల్యా:- ఏం తెలిసింది ? ఏం మేలుకున్నారు ? వీళ్ళమాటలే, నిజమా ? ఆలోచించవద్దా విచారించకూడదా ? నిజానిజాలు తెలియవా ? ఎందుకు తొందరపడతారు?

మురళీ:- అమ్మాయి, నీవు వెంక్యం చెప్పా, లక్ష చెప్పా, ఇక నేను పొరపాటు పడను. నేను బాగా ఆలోచించే చేశాను.

కల్యా:- ఏం ఆలోచించారు ? ఏం చేశారు ?

మురళీ:- ఏం ఆలోచించానా ? నిన్ను ఆ భాస్కరానికిచ్చి పెళ్లి చేయడం మానివేశాను. వాళ్లఇంటికి బ్రాహ్మ లెవరు వెళ్లకుండా వెలివేయించాను. ఇక వాడు సన్నేమి చేస్తాడో చూస్తాను. ఈ మురళీధరశాస్త్రి అంత వెఱ్ఱివాడనుకున్నాడేమో ! ః;

కల్యా:- నాన్నగారూ ! సర్వమూ తెలిసిన మీరే ఇలా మాట్లాడవచ్చునా ?

మ॥ సకలోర్వీజనసేవ సత్కృప, అహింసా ధర్మతత్వంబు, స ర్వకళాపూర్ణ యశోవిశాలతయు శీమ్మ [illegible] నాలోచన ప్రకట ఖ్యాతివహించి తా వెలయు [illegible]ఖ్యాత్ భాస్కరా హాస్కరం

డకటా ! నోటనొసంగి వేరొకనికీ[illegible] నన్నా ధర్మంబా ? ॥

మురళీ:- ఆ భాస్కరుడనకా ? మా[illegible] స్నేహంచేసే భాస్కరుడనకా ? చాలు నీ తెలివి తేటలు.

కల్యా:- అందువల్ల మీకొకకల్గిన నష్టమేమి ?

మురళీ:- నన్ను మాలకూడు తినమంటావా ?

కల్యా:- స్వచ్ఛమైన బ్రాహ్మణునికిస్తూ మాలకూడు తినడం ఎందుకు ?

మురళీ:- మాలవాళ్ళ స్నేహంచేసేవాడు మాలవాడుగాక బ్రాహ్మణుడవుతాడూ ?

కల్యా:- అట్లయితే నాకు పెండ్లి వద్దునాన్నా !

మురళీ:- పెళ్ళివద్దూ, పుట్టింది బ్రాహ్మణకులంలో, పెళ్ళి మానుకుంటే నలుగురూ నవ్వరూ ? శాస్త్రాలేమి చెపుతున్నాయి.

కల్యా:- అది తప్పమనేనా ?

మురళీ:- అమ్మా. నీవు చిన్నదానవు. నిన్నగాక మొన్న పుట్టావు, నీవు స్వతంత్రించి మాట్లాడడం బాగుండదు, ఆడపిల్లవు. పెళ్ళికావలసినదానవు. ఇంతకూ ఈ పాడు శారదా బిల్లు ఆడవాళ్ళకు కాళ్ళు తెచ్చింది.

శా॥ చాతుర్వర్ణ్యములు జ్వలింపదన విజ్ఞానంబు నల్దిక్కులన్।
ఖ్యాతిన్ బొందినయట్టి ఈభరతభూఖండంబు దుఃఖింప స్త్రీ।
స్వాతంత్ర్యంబు రగిల్చి, వర్ణ మత విధ్వంసోపదేశంబిడన్।
సూతుండై యుదయించె, ఈ హరవిలాసుం డిస్సిరో నేటికిన్॥

కల్యా:- నాన్నగారు. మీరన్నది పొరపాటు. శారదాబిల్లు స్త్రీలకు మహోపకారంచేసింది.

సీ॥ భవ్యసంసార విభంజనకారియగా
బాల్యవివాహముల్ బాయువరకు
భామల విజ్ఞానవతులజేయఁగజాలు
విద్యాలయంబులు వెడలువరకు
పురుషార్థదేహంబు పూబోడిదాసిగా
దను భావముదయించు నంతవరకు
అన్యోన్యరాగ విన్యాసంబుతో స్వయం
వరము లాదరణంబు బడయువరకు

తే॥ గీ॥ ఆర్యధర్మాశ్రయంబైన యట్టిమగువ
తన సనాతన గురుత జేకొనెడి వరకు
స్వార్థపరుల దుర్వాంఛలు సమయువరకు
భరతమాత స్వతంత్రత వరలగలదె॥

మురళీ:- ఇక చాల్లే నీ ధర్మపన్నాలు. ఎవరన్నావిన్నా నవ్వి పోతారు. నీమాత్రం నాకు తెలియదనుకున్నావా? లేకుంటే నీమాత్రం గ్రంథాలు తిరగవేయలేదనుకున్నావా? "గ్రుడ్డువచ్చి పిల్లనెక్కిరించిన" దన్నట్లు నీవా నాకు నీతులు చెప్పేది? పోయి పనిచేసికో పిచ్చిమొగమా!

లక్ష్మో:- (ప్రవేశించి) అన్నగారూ. అబ్బాయి వచ్చేవేళ దాటిపోయింది. స్టేషనువద్ద యేదైన బండిదొరికిందో లేదో? లేకపోతే యేదైనా బండి కుదిర్చి పంపండి.

మురళీ:- ఆ! మీవానికోసం నేను బండిని కుదర్చ నక్కర లేదు. అతడే నాకొక పెద్దబండను కుదిర్చాడు. ఎందుకూ మీకింకా బండ్లుకుదర్చడం?

లక్ష్మో:- అదేమిటండీ! ఈరోజు ఉదయం బండికి వస్తానని కాదూ మావాడు ఉత్తరం వ్రాసింది. అలామాట్లాడతారేం?

మురళీ:- అమ్మా. మీవాడిసంగతి మీఉత్తరం సంగతి ఇక నాకు చెప్పవద్దు. వెళ్ళి, ఆ నిరంజనాయితో మాల పల్లెలో చెప్పుకోండి. వాళ్ళపిల్లనే చేసుకోండి, చాలు. మీతో సంబంధం చేసినంతవరకూ యిక నన్ను వేధించక వెళ్లిపో.

లక్ష్మో:- అదేమిటండి. అలామాట్లాడతారు? మావాడెప్పుడొచ్చాడు? మాలపల్లెకు ఎందుకు వెళతాడు?

మురళీ:- ఎందుకు వెళతాడా? అతనికి అక్కడ బంధువులున్నారు, అత్తగారిల్లున్నది. తెలిసిందా! నన్ను విసిగించక వెళ్ళు తల్లీ. మీకు మీసంబంధానికి ఒక దణ్ణం.

లక్ష్మా:- ఆ. మాలపల్లెలో మాకెందుకుంటారు చుట్టాలు. మీరు మాలవాణ్ణి పనికి పెట్టుకొని చాకిరి చేయించుకుంటున్నారు. కనుక ఉంటే మీకే ఉండాలి.

మురళీ:- ఇదిగో లక్ష్మాయమ్మా ! నీవు ముందు ఇంట్లోనుంచి బయటికి వెళతావా ! లేక మెడబట్టుకొని గెంట

లక్ష్మా:- ఆ. గెంటుతావా ఇంతహంమా ?

కల్యా:- నాన్నా ! నాన్నా ! యేమిటది ? ఆమెమీద ఎందుకూ చేయిచేసుకుంటావు ? ఎందుకు తొందర ? నిదానించండి.

మురళీ:- అంతానిదానమే. నాజీవితమంతా నిదానమే, జిట్టిజేసివాళ్ళుకూడ నాకు నీతులు చెప్పవలసి వచ్చింది. (లక్ష్మాయమ్మనుచూచి) పోవమ్మా పోక ఇంకా మొద్దులాగు నుంచున్నావేం ?

లక్ష్మా:- నేనే మొద్దులాగున లేను. మీఇంట్లో ఉండడానికి రాలేదు. మీభోగభాగ్యాలు పీక్కుతిందామనికాదు. అన్నంతినే మనిషికి అంతకోపమెందుకు ? ముష్టి మీ సంబధంలేకపోతే ఇక మేము బ్రతకలేమనా ? ఏమి చూచుకున్న పొంగునాయనా ! ఇంత పొంగు కుంగడానికే. ఇన్ని మాటలంటే ఊరికేపోతుందా ? అనుభవిస్తావులే.

కల్యా:- అత్తయ్యా, కోప్పడకు ఆయనకెందుకోమతిపోయింది. మీరుకూడ తొందరపడకండి.

లక్ష్మి:- ఓసి పోవే శిఖండి, ఆయన కూతురివి కాదూ, మే మంత గతిలేనివాళ్ళము కాములే. (వెళ్ళును)

కల్యా:- నాన్న. ఏమిటిది? ఇట్లా చేసావు.

మురళి:- ఏమిటా! చిన్నవాళ్ళు పెద్దవాళ్ళకు చెప్పేబుద్ధులు. అత్తయ్యా, అప్పుడే అత్తయిందేం, ఇక నోరుమూసి కొని లోపలికిపో, నాకు వాళ్లు మండుతున్నవి. ఇదేదో తేలిపోవలసిందే,

(నిష్క్రమింతురు)

---

ద్వితీయాంకము 2వ రంగము వీధి

(లక్ష్మమ్మ, భాస్కరరావు)

భాస్క:- అమ్మా. ఏమిటలా విచారంగా ఉన్నావు?

లక్ష్మి:- (దుఃఖిస్తూ) నాయనా – ఏమి చెప్పేది?

భాస్క:- యేమిటి సంగతి? అసలు ఎక్కడనుండి రావడం?

లక్ష్మి:- ఆ పాపిష్టిముండాకొడుకు లేడూ మురళీధరశాస్త్రి వాడింటికి వెళ్ళడం వచ్చింది ఇంతకూ!

భాస్క:- అలా మాట్లాడతావేం వాళ్ళింటి కెందుకు వెళ్లావు అసలు ?

లక్ష్మి:- ఈమధ్య పిల్లనిస్తానంటూ ఊరేగుతుండెగా ? అందుచేత నీకోసం స్టేషనుకు బండి పంపిస్తాడేమోనని వెళ్లాను.

భాస్క:- ఏమిజరిగిందమ్మా, అసలుసంగతి చెప్పవేం ?

లక్ష్మి:- అడిగితే ముక్కుమూరెడుపొడుగుని పెట్టుకొని మా అమ్మాయి పెండ్లి ఇప్పుడు చేయను. చేసినా మీ అబ్బాయికీయనంటూ గది యెగిరిపొయ్యేలట్లు అరిచాడు.

భాస్క:- సరె, ఇవ్వకపోతే పోనీయిలే, నాకు పెండ్లి కాకన్న విచారమా ?

లక్ష్మి:- అదికాదురానాయనా. నీవువస్తూ ఆమూండాకొడుకు కొట్టిన నిరంజనునికి ఉపచర్య చేశావట. అది వాడికి తెలిసింది ఆ అవమానం భరించలేక నీవు కులభ్రష్టుడవని, నానామాటలు మాట్లాడి పిల్లనివ్వడం లేకపోగా మనకు వెలివేయిస్తానని నోటికి వచ్చినట్లు మాట్లాడాడు.

భాస్క:- అమ్మా. ఎంత పిచ్చిదానివి ? మనకు వెలిబెడితే బ్రతకలేమా ? వారి చుట్టరికం చేయకపోతే ఊళ్లో

ఉండలేమా ? ఇక తిట్టాడంటావా ? అన్యాయంగా తిడితే అనుభవిస్తాడు.

లక్ష్మి:- నాయనా. శాస్త్రి సంగతి నీకు బాగా తెలియదు. వాడు కాలాంతకుడు. "చిన్న నాపొట్టకు శ్రీరామరక్ష" అనుకొనే వారిలో ఒకడు. ఇంకా ఊళ్లో జాస్తిపలుకుబడి కలవాడు ఆస్తిపరుడుకూడా.

భాస్క:- అమ్మా. ఆస్తిపరుడైతేనేం ?

లక్ష్మి:- అలా అనకు నాయనా. నీకు తెలియదు ప్రపంచస్థితి. చిన్నవాడివి. ఆస్తిగలవాడే గ్రామానికి అధికారి. ఏ పనిచేయుటకైనా సమర్థుడు. శాస్త్రి పట్టుపట్టాడా భల్లూకపు పట్టే. మనం వాడితో నెగ్గలేము. ఒంటరి వాళ్ళమవుతాము.

భాస్క:- కానీయి. వచ్చిన నష్టమేమి ?

లక్ష్మి:- నాయనా ముందు నీశుభకార్యాలున్నాయి. పెండ్లి పేరంటము కావలసినవాడవు. మనమా బ్రాహ్మణులం సాటివారలు రాకుంటే మనమేమి చేయగలం?

భాస్క:- అయితే నీవు చెప్పేవిషయం ఏమిటి ?

లక్ష్మి:- ఆ శాస్త్రితో నీకు విరోధంవద్దు. మాలవాళ్ళతో తిరుగకుండా మనకులపద్ధతులను పాటించు నాయనా, నీకు చాలా మంచిది.

భాస్క:- అమ్మా. నీకు తెలియదు. కులహీనుల సేవచేయ
డమే కుల ధర్మం. అందులో తప్పలేదు.

తే॥ గీ॥ విపుల సంపదలెల్ల నశ్వించుగాక।
ఉర్వి సుఖలెల్ల వెలిని వేయుదురుగాక।
కష్టములు కొంటకచ్చునైవ కాల్చుగాక।
పంచములకిత్తు నా ప్రాణ పంచకంబు॥

లక్ష్మి:- నాయనా, నీకష్టాలు చూడటానికేనా నేను బ్రతికి
ఉన్నది? నామాటవిను. కష్టాలు కోరి తెచ్చుకోకు.
నీవు బాధపడుతుంటే నేను చూడలేను.

భాస్క:- అమ్మా. ఇదొక కష్టంకాదు. ఎన్ని కష్టాలైన సహి
స్తాను. గాంధీమహాత్ముడు హరిజనులకై కష్టపడ
లేదూ! అంతకంటే నేనెక్కువా? ఇదేదో మంచికే
వచ్చింది. నీకు తెలియదు. నాకు భయంలేదు. పద
ఇంటికి పోదాం.

(నిష్క్రమింతురు)

---

ద్వితీయాంకము 6వ రంగము

పానశాల

(విశ్వపతి, స్నేహితులు, మోహన్, బలరాములు)

కీ ర్త న

విశ్వ:- సారామజాకేది సరిరాదీయిల ॥సారా!
సారెసారెకు గొనగస్వర్గంబు జూపించు ॥సారా॥
కష్టముల మరిపించు కల్పతరువు సారా।
ఇష్టసిద్ధులొసంగు యిలదైవమిదిరా।

త్రి శ్ర గ తి

ఓట్లలోనిది మిగుల నూటిగచరియించు
పోటీగ మేళములలో పొంగుచును గెంతించు।
మేటివిందులలోన సాటిలేకవిహరించు।
వాటమైన పేకాటలో వదలకా నిలచిమించు।
॥సారా॥

గాంధీటోపీ పెట్టేవాడల్లా దేశనాయకుడు. ఖద్దరుకట్టే వాడల్లా కాంగ్రెసు అభిమాని, గాంధీటోపీ, ఖద్దరుతో వస్తారు చందాలంటూ. ఈ డబ్బేమిచేస్తారో చెప్పరు. ఖాతాపుట్టని సారాయివాళ్ళకిస్తే వీళ్ళ పేరు చెప్పుకొని బ్రతుకుతారు. దేశంలో త్రాగుడుతక్కువ, సారాయి

సంఘాలేర్పడాలి. అప్పుడే దేశానికిమోక్షం. విదేశాల్లో త్రాగుడుజాస్తి. అందుకనే ఆదేశాలు గొప్ప పేరులో ఉన్నాయి. మనదేశానికి పేరుప్రతిష్టలు రావాలంటే విదేశాల్లోమాదిరి సంఘాలు వృద్ధిచేయాలి. దార్జన్య రాహిత్యం అంటారు. దార్జన్యంలేంది పని అవు తుందా? దణ్ణంపెట్టి బాబూఅంటే ఎవడైనా వింటాడా? బలంరావాలంటే సారాయి తాగాలి. బలంలేకపోతే జీవంలేదు. జీవంలేకపోతే ప్రాణంలేదు. నటుడు కావాలంటే బాగా తాగాలి. తాగితేనేగాని నటించలేడు. అందుకనే గొప్పనటకులు తాగుతారు. తాగుడు ఉత్సాహం ఇస్తుంది. ఉత్సాహం ఉంటేనే గాని కూలీలు పనిచెయ్యరు. వాళ్లు పనిమానివేస్తే యజమానికి డబ్బేలేదు. అందుకోసం యజమాని తాగాలి. కూలీల్ని తాగమని చెప్పాలి. అన్నం అన్న పూర్ణతల్లి అంటారు. సారాయిదేవత అంటారుకాబట్టి సారాయి దేవత గొప్పది. పెద్దవాళ్ళకిచ్చే గౌరవం ఇవ్వాలి. సారాయి వొట్టినీళ్ళనుకొన్నారా? తాళవృక్ష సారం. తాళంఅంటే లయజ్ఞానం. కాబట్టి సారాయి లయజ్ఞానవృక్షసారం. లయజ్ఞానం సంగీతం పాడే వానికి ఆనందం ఇస్తుంది. సారాయి మజా సన్యాసుల కేమి తెలుస్తుంది?

సీ॥ చోరత్వమునకేగి సొమ్ములుగొనిరాగ
బహుధైర్యమిదు మద్యపానమెగద

పశుల శిరస్సుల బద్దలుసేయగా
బలమొసంగును మద్యపానమెగద
పరదారలను చెఱబట్టగా సమకూర్చు
బాహుసత్వము మద్యపానమెగద
సర్వకార్యముల నుత్సాహముఁ గూర్పంగ
ప్రథమదేవత మద్యపానమెగద

తే॥ గీ॥ భాగ్యముల గూర్చునదిమద్యపానమెగద
జ్ఞానవైరాగ్యమిచ్చు మద్యపానమెగద ?
పతులవంచింపగను మద్యపానమెగద ?
పరమమైత్రి నొసగు మద్యపానమెగద ? ॥

(నిష్క్రమింతురు)

---

ద్వితీయాంకము 7వ రంగము

## ఉద్యానవనము

(కల్యాణి పూలదండలతో దేవాలయమున కేగుచూ భాస్కరుని జూచును)

## కీర్తన

కల్యా:- నాతికి పతిపదసేవ, స్త్రీజాతికి పదసేవ।
జీవితనావా ముక్తికిత్రోవ ।నాతికి।

దేవదేవా కరుణనుబ్రోవా వేగమెరావా దీనురాలి
మొరవినవా ।నాతికి।

భాస్క:- (కల్యాణినిజూచి చకితుడై) ఎవరు ? కల్యాణేనా ? ఏమిటీపూలు పండ్లూ ? ఎక్కడికి ?

కల్యా:- (సిగ్గుపడి మాట్లాడకుండును)

భాస్క:- ఓ హూ మురళీధరశాస్త్రిగారి కుమార్తె కల్యాణి. అవును. పొరబడి పల్కరించాను. పూర్వపు చనువు నన్ను మోసంజేసింది, ఈ భాస్కరుడానాటి భాస్కరుని వలె స్వతంత్రించి పల్కరించినందులకు క్షమించు కల్యాణి.

కల్యా:- నేనిప్పుడు మీతో ఏమిమాట్లాడవలెనో తెలియడం లేదు. నన్ను నొప్పించుటకిది సమయంకాదు. నేను మురళీధరశాస్త్రిగారి కూతురు కల్యాణినే. ఆనాటి కల్యాణినే. నాలో యేమార్పున్నూ లేదు. నాలోనున్న భాస్కరమూర్తికికూడా-

భాస్క:- కూడాకూడా యేమి ?

కల్యా:- మహాపత్తులో మునిగి వెనకాముందు గతిలేని నావంటి అబలులను ఈ నిష్ఠురమైన వాక్యములచేత నొప్పించి యేమి చెప్పించగలరు ? దైవదర్శనమునకై బయలుదేర దైవమువోలె దర్శనమిచ్చిన నాదైవమే

నన్నీ సమయంలో రక్షించుటకు మారుగా నొప్పించిన యెడల ఇక నాకు గతి యెవరు? నాహృదయాధినాథు డగు భాస్కరుడింత నిష్ఠురుడు కాజాలడు.

భాస్క:- అకారణముగా అమాయకులను నిరపరాధులను శిక్షించి వెలి మొదలగు బాధలను పెట్టిన మురళీధర శాస్త్రిగారి కూతురు కల్యాణేనా యీమాట్లాడేది?

కల్యా:- అవును. ఆ కల్యాణే మాట్లాడేది. కాని అమాయికు రాలును, ప్రేమైకజీవి, నిష్కల్మషురాలునగు బాలి కను స్వచ్ఛమైన ప్రేమచే బెంచి తుదకు అసందర్భపు కారణములచేతను, పరుల స్వభావము చేతను, నమ్మిన వారిని నొప్పించి మోసగించునది ఆ భాస్కర మూర్తియేనా?

భాస్క:- కల్యాణి, క్షమించు. నీ భావము తెలుసుకొనుటకే ఇంత నిష్ఠురముగా మాట్లాడవలసి వచ్చినందులకు నేనెంత పశ్చాత్తాప పడుచున్నానో ఆ దైవమున కెఱుక. నా కల్యాణిని గుర్తించకపోలేదు. స్పష్టముగా తెలిసికొనుటకే ఇట్లు మాట్లాడితిని.

కల్యా:- అవును మీకేమి. విద్యాధికులు. సంపన్నులు. ధైర్యవంతులైన పురుషులు. మీరే తాత్కాలిక కారణములచేత నెట్లయిన మాట్లాడవచ్చును. ఇప్పుడు నాగతేమి? నాతండ్రి మతిలేని స్థితిలో నే

మేమి చేయుచున్నాడో మీకేమి తెలియును? నిన్న మీతల్లిగారిని సంస్కరించినప్పుడు సైతము వేరేమియు చేయలేని స్థితిలో నేనెంత కృశించితినో, ఆ దైవమున కెఱుక.

భాస్క:- తెలిసినది. మాఅమ్మగారంతా చెప్పినది కాని-

మ॥ అతినిష్ఠాపరుడౌచు కేవలము శాస్త్రాచారసంపన్నుడౌ
నతి గారాబముతోడ బెంచితిని, దుఃఖాంభోధినీతండ్రి నిన్
బతనున్ జేయుట పాటిగాదు. యిక నేనాసంఘసంస్కర్తనన్
బతిగాగోరి యెటుల్ సుఖించెదవు? భామాలోన
చింతింపుమా॥

కల్యా:- ఇక నాహృదయము విప్పి చెప్పక తప్పదు గాన వినుడు, మహాశయా! నన్నెందుకింకనూ పరీక్షించెదరు? త్రికరణ శుద్ధిగా మిమ్మే నమ్మియున్నాను.

భాస్క- బేలా. నీసంకల్పము యోగ్యమైనదే. కాని నెరవేరుట కెన్ని ఆటంకములున్నవో ఆలోచించుకొనుము.

మ॥ కులమున్ వాసితి, భూసురులలో గూర్చుండు మర్యాదయున్
గలుగన్ బోదటువున్ బహిష్కృతుడన ఖ్యాతుండనేకాకి, నా
తలపుల్ వచ్చును మీకు పంచమకులోద్ధారంబు నాభావమో

పాలతీ! మొదుల కేసు, గోరుము ననున్ బోనాడి వేశొక్క-
సిన్.

కల్యా:- ఎన్ని ఆటంకములున్నను నాసంకల్పము నెరవేరితీర వలసిందే అదే జరుగనినాను.

తే॥ గీ॥ బ్రహ్మచారిణీవృత్తిలో బ్రతినదాల్చి
దేశసేవయు భగవాను దివ్యసేవ
జేయుచును, మిమ్ము దలచుచు జీవితంబు
గడిపి, కడకు నీయాత్మలో గలయుదాన॥

భాస్క:- ప్రేయసీ! నాసంతోష మేమని వర్ణించేది?

శా॥ ఏకాంతమణిపొందు నాకిహపరంబేయంచు కాంక్షింతు
నో
యేకాంతామణిదృష్టి సౌఖ్యమని నే నెల్లప్డు వీక్షింతునో
యేకాంతామణినామధేయము సదాయిచ్ఛాజపంబయ్యెనో
యాంకాతామణి భార్యయంచు వినుటాహా యేమి నా
భాగ్యమో॥

నీవిక దేవాలయమునకు వెళ్ళుటకు ఆలస్యమైనది కాబోలు.

కల్యా:- లేదు. హృదయేశ్వరా! భార్యకు భర్తయేకదా దేవుడు. దేవతామూర్తిని దర్శించాను. నా అభీష్టము సిద్ధించింది. ధన్యురాలనైనాను. యిక నే దేవాలయము

నకు బోనేల! యిప్పుడనే ఆరాధిస్తాను. (ప్రాల దండనుజూచి) ఓ పుష్పరాజమా. నీ వెంత ధన్యురా లవు? ఎందుకన ఆతడు సర్వేశ్వరుడు. ఈతడు హృద యేశ్వరుడు. ఆతడుత్రినేత్రుడు ఈతడుజ్ఞాననేత్రుడు. ఆతడు నిరాకారుడు. ఈతడు సాకారుడు. ఆతడు రజితాచలవరనివాసి. ఈతడు హరిజనపురనివాసి. ఆతడు రుద్రభూమి సంచారి ఈతడు క్షుద్రజంతు భూమి సంచారి. ఆతడు సృష్టికర్త. ఈతడు సనాతన సంఘసంస్కర్త ఆతడు త్రిశూలపాణి. ఈతడు సచ్ఛీలపాణి. ఆతడునందివాహనుడు. ఈతడుస్వచ్ఛంద వాహనుడు ఆతడు నాగభూషణుడు. ఈతడు త్యాగ భూషణుడు. ఆతడుగరళకంఠుడు ఈతడు సరళకంఠుడు. ఆతడు రుద్రుడు ఈతడుసత్యాగ్రహుడు. ఆతడు భక్త జనకల్పవల్లి, ఈతడు పంచమజాతి కల్పవల్లి. ఆతడే యీతడు గనుక

ఉ॥ ఏమహానీయుకీర్తి దిశలెల్లెడ దెల్లగవ్యాప్తమయ్యెనో
యేమహానీయు నుద్యమము నెల్లెడ సంస్తవనీయ మయ్యెనో
ఏమహానీయుభర్తగను యిన్నిదినాలు తపించుచుంటినో
ఆమహానీయు దివ్యగళమందు వసింపుము పుష్పదామమా.

ఇక దైవారాధనకుపక్రమింపనింక.

భాస్క:- (నవ్వుచునిలబడును)

## కీర్తన

కల్యా:- దైవము వేరే కలదా సతికి, భావింపగ పతియేగాద
ఫలపుష్పంబుల పూజించెదరా చల్లని
చూపుల సోకం గదరా ॥దైవ॥
భాస్క:- నీభావము నే నెరిగితినబలా. నామది భారము
దీరెనుచాల
కల్యా:- ఆనంద మాహా ఆ పలుకులువిన మేను పరవశ
మాయెను నాథా
భాస్క:- సాగరమున నది జేకురీతిగా రాగముతో నను జేరుము
చెలియా
ఇద్దరు:- దేవుని దయచే ధన్యతగలిగే భావన జేతుము మామది
దేవా॥

(నిష్క్రమింతురు)

---

# మా ల దా సు

తృతీయాంకము 1వ రంగము

## జా త ర

(మాలలు, తాత, నిరంజనుడు, భాస్కరుడు)

[మాలగూడెంలో జాతర ఆడంబరం. అమ్మవారి మెడలో పుర్రెలు హారాలుగా ఉంటాయి. ఎదుట మూకుళ్ళలో నిప్పుమీద గుగ్గిలం పొగ వస్తూవుంటుంది ఎదుట కల్లుబానలు 5,6గురు మాలలు మూఢభక్తితో పాడుతూ తూలుతుంటారు. మేకలు పసుపు పూయబడి ఉంటాయి తప్పెట్లవీరంగం మోత ముసలివాడు ముఖ్యపాత్రగా ఉంటాడు]

## కీ ర్త న

ప॥ కాళికమ్మో కావుమమ్మో కరుణించిమమ్మేల
అ॥ సల్లనితల్లో నీకు సేవను జేతు మేమెప్పుడును ॥కాళి॥

1 చ॥ సలిమిడివడపప్పుతో, పాలు పానకాలనిచ్చి
ఏలికవని ఏటేట ఏడుకొందుమమ్మరో ॥కాళి॥

2 చ॥ ఏటపోతునిత్తుమమ్మ ఏడుకనిక కోళ్ళనిత్తుము।
ఓటమైన జాతరా పట్టుదలతో సేతుమమ్మ॥
మాటలందు సేతలందు మాకుతోడు నిలువుమమ్మ
॥కాళి॥

తాత:- మిగతా నాట్ని కూడ తొరగా తెంండ్రా.

వెంక:- సూరిగా కత్తెతీసుకో

తాత:- తప్పెట్లు బాగా మోగించండ్రా. ఆ నల్లమేక తేరా? (నల్లమేక మూకుడు తెస్తారు. పట్టుకుంటారు. ధూపము సూరడికిస్తారు. నిరంజనుడు ప్రవేశించును)

నిరం:- (ప్రవేశించి) సోదరులారా! ఆగండి. ఏమిఅన్యాయం ఇది. నోరులేని పశువులను బలీయవచ్చునా? ఇది మహాపాపంకాదు? ఈ జంతువెన్నడైన మీకప కారము జేసెనా? అయ్యో, ఎంతపిచ్చివాళ్ళు మీరు. నిన్నటి వరకును దీనిపాలు త్రాగారే! వీటి ఎరువుతో పంటలు పండించుకొని తిన్నారే! అట్టి మహోప కారముచేసిన జంతువునకి డేనా మీరుచేయు ప్రత్యుప కారం? ఇది గొప్ప అన్యాయంకాదా? మహా పాపం కాదా?

తాత:- ఏందిరా కూత్తుండావు వొచ్చి తెల్చినోడిలాగా, అమ్మోరికి బలీయకుంటే గత్తర్లు రావండ్రా. సిన్న మ్మోరు, పెద్దమ్మోరు, దూము ఇయ్యన్ని యాడ్నుం డొత్తండయ్యో సెప్పు.

నిరం:- తాతా! పెద్దవాడివి, నీకీమాత్రము తెలియదా? కలరా ప్లేగు, స్ఫోటకము ఇలాంటివి అంటువ్యాధులు కావా? మురికి నీరు త్రాగుటచేతను, చెడ్డగాలి

పీల్చుట చేతను అంటువ్యాధులు కల్గుచున్నవి గాని అపరిశుభ్రంగా ఉండి దేవతను కొలిచినంతమాత్రాన అంటువ్యాధులు పోతాయా ?

తాత:- తరతరాలనుండి వొత్తూండ ఆశారాన్ని కాదంటావా! అమ్మోరికి కోపంవొత్తే ఏంసేత్తా ?

సిరం:- తాత. ఎంత పొరబడ్డావు. తరతరాలనుంచి వస్తున్న వంటున్నావు. మన కులంలో తరతరాల క్రిందట ఎలాంటి మహాత్ములు పుట్టారో నీకు తెలుసునా ! వారంతా ఇలా దేవరను గొల్చియే మహాత్ములైనా రంటావా !

సీ॥ అలవసిష్ఠమహర్షి వెలదియరుంధతి
ప్రభవ మొందిన మహావంశమేది ?
ఘన తపోనిధి మతంగమునీంద్రచంద్రుడు
జననమెత్తినగోత్ర జలధియేది ?
విష్ణ్వాలయములలో వెలయునాళ్వారుల
పలువురుద్భవమైన వర్ణమేది ?
జగదేకసేవ్యయౌ శ్యామలాదేవి సం
జాతమైన సువర్ణసౌధమేది ?

తే॥ గీ॥ అట్టి కులమును పంచమంబనుచు నెరిగి
కడకు ద్రోయంగ మీకెటుకల్గుమేలు

అమలగుణములె పూజనీయములుగాని
కాటికేగెడి కాయంబు ఘనమటయ్య.

తాత:- ఏంసిరాదాసాయ్! యాదాలు, పురానాలుమాదగ్గర సమువుతుండావు పురానాలేడొన్సిండొచ్చాయో? నీవు సెప్పేవాలేమండాలో, ఎప్పుడుండారో వోరికి తెలుసు? అమ్మోర్ని కొలుపులు మాఅయ్యసేసాడు. మా పెద్దయ్యసేసాడు. మా జేజెయ్యసేసాడు. మేమూ సేత్తుండాము. దీంట్లో తప్పేం?

సుం:- తాతా! నేనుచెప్పినవారి జీవితాలు పురాణాలలోని పుక్కిడి కథలంటావా? అట్లాయితే భూలోకములో జీవించి పేరుప్రతిష్ఠలు పొంది సువర్ణాక్షరములతో లిఖింపబడిన చరిత్రకారులనేకులున్నారు.

సీ॥ ద్రవిడ వాఙ్మయ శిరోధార్యమందారంబు
తిరువళ్లు వరుకన్ను బెరచెనెందు?
తతచిదంబర భాగవతసార్వభౌముండు
నందనారుచ్ఛ్వాస మొందెనెందు
కల్యాణ సచివశేఖరున కాచాక్యుండు
గగ్గభక్తుడు గ్రోలెనుగ్గునెందు?
వారణాసీ పుణ్యపరిపాక ఫలశీలి
రోహిదాసు త్రిళ్ళలో ద్రుమ్మెనెందు?

తే॥ గీ॥ మధుర మార్దవ కావ్యరసూపయోధి
యార్యుడానందు డాత్రేయుడయ్యె నెందు?
అట్టి శ్లోకో త్తమంబైన యన్వయంబు
పంచమ కులంబుగాదె యో భ్రాతలార.

వెంక:- పోరా ఎట్టిఏదాంతంసెపుతావ్. ఏదాంతం ఆశారం కలుత్తుందా? ఏదాంతం యేదాంతమే? ఆశారంఆశారమే? అమ్మోరికి బాంబలే మొక్కులు సెల్లిత్తుంటే యీడొచ్చియెట్లా సెప్తాడేం. సూత్తా రేంరా కానీయక.

నిరం:- నాయనా! బలులకు కులముతో నిమిత్తంలేదు. జీవహింస ఎవ్వరును చేయరాదు.

సీ॥ ఆదిశక్తియె జీవులన్నింటికిని తల్లి
యనుచు భావింపుడో జనములార
పిల్లల బలివెట్ట తల్లికితృప్తియా
మది ధర్మమెంచరే మనుజులార
జాతర్ల నెపమున జంతుసంతతిజంపి
తిన మహాఘోరమో యనుజులార
బలివేళ నాజీవి పడుబాధమూడమీ
గుండెలుపగులవే కుమతులార

తే॥ గీ॥ బ్రతుకదలచిన నిండుజీవములనిట్లు
బలులకని తెచ్చి చంప పాపంబుగాదె

ఆత్మవత్సర్వ భూతాని యనుట నెరిగి
హింససేయక బలుల మాన్పించరయ్య!

కావున అన్నలారా! జీవహింస మానండి. అదిమీకు తగదు.

తాత:- నీసోకి కట్టిపెట్టా సెప్పలు పోతుండాయి. సూరదా కత్తెత్తు ఈసితో వేంగాని సుసకు?

నిరం:- (నిరంజనుడు తోసికొనిపోయి బలి పశువును కౌగలించుకొనగా మాలలు వానిని బలవంతముగా నెట్టి వేయుదురు. అప్పుడు దాసు దేవతకభిముఖుడై) తల్లీ నీకైన దయ లేదా? ఈ అమాయకుల చేత సేవచేయించుకొనుటకు నైవేద్యము అందుకొనుటకు జీవహింసతప్ప వేరే గత్యంతరము లేదా? పండ్లు, పానకములు నారగించే నీకు నిజముగా పశు రక్తమాంసముపై వాంఛ కలిగెనా? లేక మా కులస్థుల మూఢత్వమేనా? మహాపరాధము, మహాపరాధము తల్లీ నీచే సృజింపబడిన జంతుజాలములు నీసంతానమే కదా? కన్న సంతానము నారగించు కఠిన రాక్షసివి కాగలవా? కావు. కావు. తల్లీ నీబిడ్డలము. మాయందు దయ యుంచుము. హీనజాతియని అధోగతికి త్రోయకుము. మాకు విజ్ఞానమును చేకూర్చుము. మానవజాతిలో మాకుగూడ గౌరవ మర్యాదలు కలుగునట్లు అనుగ్ర

హీ ప్రుము. తల్లీ. పాహిమాం. పాహిమాం. (అప్పుడు తాతకు శివము ఆవేశించి మాట్లాడును)

తాత:- (ఆవేశముతో) ఆ ఆలస్యము సేత్తుండారు. ఆశా రాలు పోగొడుతుండారు. నాకాకలి అవుతుండది. ఆలస్యం సేత్తిరా మీఅందర్ని ఇరుసుకు తింటాను. దాసాయి అపచారం సేత్తుండాడు. నేను సూత్తునే యుండాను. మీరు యింటూనే ఉండారు. మిమ్మల్ని పీక్కు తింటాను. (అంటూ అరుచును)

అందరు:- అమ్మా. లేదు. తల్లీ. ఈడే, అడ్డంవత్తుండాడు. మేమంతా చిద్దంగానే ఉండాము,

తాత:- వాడడ్డం వొత్తుంటే వాడ్నే బలియ్యండి. ఇక ఆగను. ఆకలయింది. ఇత్తారా? ఇయ్యరా? తింటా; పీక్కు తింటా; పిల్లల్ని తింటా, పెద్దల్ని తింటా; నలుసైన లేకుండా తింటా,

అందరు:- (నిరంజనుని పట్టుకొని బలి పశువుచోట కట్టి నిలబెట్టుదురు)

కీర్తన

నిరం:- కావా రావే కాళీ మాత......

భావ్యమా గొన బలులనీగతి...... ॥కావ॥

ఈనని పులివలె కనినబిడ్డల
తిన నెంచెదవా! కనవా మముదయ! ॥కావా॥

(సూరన్నకు పూగవేసి ఆవేశమెక్కించుచుండగా)

భాస్క:- ఆ. ఆ. ఆగండి. ఆగండి. నాయనలారా ఆగండి. ఏమిది? మీసోదరునా చంపేది? అయ్యో. ఎంత మూర్ఖులు మీరు? పశుబలితో బాటు నరబలి కూడ ప్రారంభించారా? మీచేతులెట్లాడుతున్నవి? మీఅధో గతి పాలు ఈనాటికైనా తెలుసుకోనరా? ఈదాసు పరమ యోగి. వందనీయుడు. స్తుతిపాత్రుడు.

అందరు:- బాబూ. రచ్చించండి. మాతప్పు చమించండి.

భాస్క:- ఈపుణ్యాని మీజాతి సేవకుని క్షమాభిక్ష కోరండి. లేకుంటే ఈపాపం మీరు మూట కట్టుకుంటారు.

అందరు:- (దాసునిజూచి) తమ్ముడూ. మమ్మల్ని చమించవు. నీవు గొప్పోడివంట. అయ్యగారు సెప్తుండారు.

నిరం:- సోదరులారా! పశుబలి మానతారా!

అందరు:- ఆ. మానాం. నీవెట్టాసెపితే అట్టా వింటాం. ఇంకెందుకు. నీమాట యేదంలో ముక్కలాగ నడుసు కుంటాం.

భాస్క:- సంతోషం నాయనలారా! అజ్ఞానం పోగొట్టు

కొనండి. మద్యపానం మానెయ్యండి. మాంసాహారం వర్జించండి.

ఉ॥ గీరిన జేరు చెంత గిలిగింతలతో నతి మోదవార్ధిలో
నోరునులేని జంతువుల నోళ్ళుబిగించి వధింప పట్టి డా
హారపు వాంఛకా? పశులహత్యలుసల్పుట కాయగూరలే
ధారుణిలేవె? ధర్మమగు దైవముమెచ్చునె? పేరు
వచ్చునే?

అందరు:- సిత్తందొరా. మీరు సెప్పినట్టే యింటాం.

భాస్క:- మీకు శుభమగుగాక. సోదరులారా! నేడుసుదినం. మన హిందూదేశంలో ఘోరాతిఘోరమైన యీ దురాచారాన్ని అరిగట్టడానికి సమకట్టిన ప్రథమ దివసం; మీరు భగవంతుని దృష్టిలోని వారని గుర్తెరుగండి. మీలోనుండు దివ్యస్వరూపమును తెలుసుకొనండి. మీరందఱును ఏకకంఠంతో దాస్యవిముక్తికై పాటుపడండి. అందుకై ఎంత త్యాగమైన చేయుటకు సిద్ధపడండి. ఆనాడుగాని హిందూమతంలో స్వాతంత్ర్యము లభింపదు.

నిరం:- నేడు మన జీవితంలో నూతనఘట్టం. జయ్ భాస్కర్ పంతులుగార్కి, జయ్ భరతమాతకు, జయ్ ఆంధ్ర ప్రదేశకు-

## కీర్తన

భారతమాత కరుణాన్విత (శ్రీ)
పావన శుభచరిత. ఆ...ఆ... ॥భారత॥

అరమరజూపక ఆదరింపుమము అధమజాతియనక
మత భేదములమాన్పి మమత బ్రోవవమ్మ
నీతనయుల నల్వురిలో మసలజేయుమమ్మా ॥భారత॥

పరిశుభ్రతయును పాడిపంటలు పరగజేయుమమ్మా
సరియగు విద్యల సమకూరజేసి సమతజూడుమమ్మా
॥భారత॥

మా ఆశయమును మహా విజయముగా వెలగజేయుమమ్మా
మా పూజలగాని మా సేవలుగాని మమ్ముదీవింపగదే।
॥భారత॥

(నిష్క్రమింతురు)

తృతీయాంకము 2వ రంగము

## మురళీధరశాస్త్రి గృహము

(మురళీధరశాస్త్రి, విశ్వపతి, మోహన్, బలరాములు, కళ్యాణి, భాస్కరుడు, ఇన్‌స్పెక్టరు, పోలీసులు)

విశ్వ:- (కల్యాణియొద్దకువచ్చి చెక్కిలిదువ్వగా కల్యాణి నిద్ర లేచును)

కల్యా:- ఎవరు ? విశ్వపతి ! ఓరిపొగరుబోతా. పొమ్ము. ఎన్ని మారులు చెప్పినను బుద్ధిలేదు. పశువుకంటె హీనుడవే. అర్థరాత్రి సమయమేమి ? నీవు వచ్చుటేమి ?

విశ్వ:- ప్రేయసీ -

కల్యా:- ఛీ నోరుమూయి. ఇక్కడనుండి కదలవేం. మొద్దువలె నిలబడతావు.

విశ్వ:- ప్రేయసీ ! తిట్టు. ఇంకాతిట్టు. నీపైనున్న మోహము నన్ను గ్రుడ్డివానిని చేస్తున్నది. నన్నుచూచి తిట్టు. నీ చూపుతో బ్రహ్మానందము కల్గుచున్నది. తిట్టటమే కాదు, కొట్టు. నీకరస్పర్శ చేతనైనా ఆనందిస్తాను.

కల్యా:- ఛీ పశువా ! పశువుకువచ్చినట్లు ఏళ్ళు వచ్చినయి. ఎందుకు ? జ్ఞానములేకపోయినతర్వాత, ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకో. వచ్చినదారినపో. లేకుంటేమానాన్నను

పిలుస్తాను. గుడ్లగూబవలె చూస్తావేం? అవతలకుపో
త్రాగుబోతూ!

విశ్వ:- కల్యాణి. ఏమి నీఆగడము. ఇంత కఠినంగా పల్కు
తున్నావు? నాశక్తి ప్రభావం తెలియదుకాబోలు.
నీప్రాణం నీతండ్రి ప్రాణం నాచేతులో నున్నవని తెలు
సుకో. నిన్నిపుడు చెరపెడితే ఎవరు ఆదరిస్తారో
చూస్తాను. నామాటవిను. నీచెక్కిలి ఒక్కసారి ముద్దు
(అని చెక్కిలి పట్టుకొనబోవును)

కల్యా:- హానాన్నా. రక్షించు. విశ్వపతి-నీచుడు-చెర-నాన్న
నాన్నా-నాన్నోయి.

మురళీ:- (నిద్రిదిలేచి పరుగెత్తి) ఓరి కృతఘ్నుడా! మామ
అనే భయంలేకుండా సంచరిస్తున్నావు. నిన్ను పెంచిన
ఫలితమాయిది? నా కృషి విషసర్పానికి పాలుపోసిన
చందమైంది. నీముఖంచూస్తే పంచమహా పాతకం
చుట్టుకుంటుంది. శీఘ్రంగా ఇంట్లోనుంచి వెళ్ళి
పోతావా లేక బుద్ధిచెప్పాలా?

విశ్వ:- వెళ్ళిపోవాలా? ఇదిగో పోతున్నాను. చూడు.
(అని కత్తిదీసి మురళీధరశాస్త్రిని పొడుచును)

మురళీ:- హా పాతకీ! విశ్వాసఘాతకీ! ఖూనీ! ఖూనీ! అనుభ
విస్తావు. ప్రతిఫలమనుభవిస్తావు. అమ్మా. కల్యాణి.
పోతున్నాను. దేవుడే నీకు దిక్కు. కృష్ణా. కృష్ణా.

కల్యా:- హా నాన్నా (మూర్ఛపోవును)

విశ్వ:- (కల్యాణిని తీసికొనిపొమ్మని మోహన్ బలరాములకు సైగ చేయును)

భాస్క:- (ప్రవేశించును) ఎక్కడో కూసి అంటున్నారు. ఎవరైఉంటారు. (అని అటూఇటూ పరుగిడుచు లోనికివచ్చి శాస్త్రి మృతకళేబరమునుజూచి) శాస్త్రి గారే! ఎవరుచంపిరి? ఇక్కడెవ్వరునులేరే? ఆశ్చర్య కరముగా నున్నది. (శాస్త్రిగారిని కదిలించును) శాస్త్రి గారు, శాస్త్రిగారు, పలుకుట లేదు. చనిపోయినారు కల్యాణి ఏమయినది? (వెదకుచూ) కల్యాణి! ఆ! కల్యాణి ఏది? ఈ భయంకర హత్యనుజూచి ఎచ్చటి కైన పరుగెత్తెనా? లేక ఏదుర్మార్గుడైన చెఱబట్టెనా? (ఆలోచించి) విశ్వపతి కానరాడేమి? ఏమయినాడు? ఈతడే చేసి ఉండునా? పాపపుణ్యములు భగవానుని కెఱుక. (తలుపువద్దకువచ్చి) ఆ. ఇదేమి? తలుపు వేశారే? నన్నుగూడ బంధించారా? ఆ తెలిసినది. హంతకుడెచ్చోటనో దాగి నన్నే హంతకునిగా ఋజువు చేయుటకు పన్నిన పన్నాగమే ఆహా! ఎంత మోసము?

విశ్వ:- (ఇన్‌స్పెక్టరుతో ప్రవేశించి భాస్కరుని జూపుచూ) అయ్యో! వీడే హంతకుడు. మామేనమామను చంపిన ద్రోహి.

భాస్క:- అయ్యా. వందనములు.

ఇన:- నిన్ను అరెస్టు చేసాను.

భాస్క:- నేను నిర్దోషిని బాబూ !

ఇన్:- అయితే ఎందుకున్నావు ఇక్కడ ?

భాస్క:- మాఅమ్మగారికి మందు నిమిత్తం డాక్టరువద్దకు పోతుండగా "కూని" అని కేక వినబడినది. అదివిని లోనికి వచ్చాను.

ఇన్:- మరి లోపల ఎందుకున్నావు.

భాస్క:- నేను లోనికి రాగానే ఎవరో తలుపులు వేశారు.

ఇన్:- నీవేమి చేస్తుంటావు? ఉద్యోగం ?

భాస్క:- నేను పట్టభద్రుణ్ణి. హరిజనవాడ పాఠశాలో పాధ్యాయుణ్ణి.

ఇన్:- నీపేరు.

భాస్క:- భాస్కరరావు.

ఇన్:- ఈ కేసువిషయంలో నీవు నిర్దోషివని చెప్పుటకు తగిన సాక్షులు గలవా ?

భాస్క:- లేదు.

ఇన్:-అయితే నేనేమి చేయగలను ? నీవు కారాగృహానికి

రానాలి. (విశ్వపతి చెవులో చెప్పిన పిమ్మట) కల్యాణిని ఏమిచేశావు?

భాస్క:- నాకేమి ఆసంగతి తెలియదండి.

ఇన్:- తెలియదూ. నీసంగతి తర్వాత ఆలోచిస్తాను. (పోలీసులనుజూచి) ఓయీ. ఈతని తీసికొనిపోయి కొట్టులో వేయండి. (రెండవపోలీసునుజూచి) నీవుకల్యాణి విషయమైజాడలుతీయి. (ఇన్‌స్పెక్టరు పోవును. భాస్కరుని చేతికి సంకెళ్లు వేయబడును)

భాస్క:- హంతకుడనా? కుల బహిష్కృతుడనే గాక హంతకుడ నైతినా?

సీ॥ అతిభక్తినెడబాయ కనవరతంబునిన్
మదిలోనదలచు నా కిదిఫలంబ!
సంఘదోషంబుల సమయింపజేయగా
మదిలోనదలచు నా కిదిఫలంబ!
హరిజనక్షేమంబు నభివృద్ధికిని దేగ
మదిలోనదలచు నా కిదిఫలంబ?
బీదసాదలగాంచి ప్రేమతో బోషింప
మదిలోనదలచు నా కిదిఫలంబ!

తే॥ గీ॥ ఎల్లసమదృష్టిజూచు నా కిదిఫలంబ!
ఇద్ధమతులపూజించు నా కిదిఫలంబ!

ఏమియెఱుగని నిర్దోషికిది ఫలంబ !
ఈశ్వరా ! నామనీసేవకిదిఫలంబ !

శాస్త్రి:- రావయ్యా. రా (అని భాస్కరునిలాగును)

భాస్క:- హా పరమేశ్వరా. దీనబంధో (ఇంతలో నిరంజనుడు వచ్చిచూచి)

నిరం:- (నిశ్చేష్టితుడై) ఇదేమిటి?

భాస్క:- ఇదా! దయాదాక్షిణ్యాలు గలవారికి కలిగే బహుమానం.

నిరం:- అంటే?

భాస్క:- మురళీధరశాస్త్రిగారిని ఎవరో కత్తితో పొడిచి చంపారు. ఆధ్వని విని లోనికిపోవుసరికి తలుపులు బయటివైపు బిగించారు. వెంటనే వీరు వచ్చారు. ఈ విధంగా తీసికొని పోతున్నారు.

నిరం:- శివశివా. శాస్త్రిగారు చనిపోయినారా? మరి కల్యాణమ్మగారు?

భాస్క:- కన్పించలేదు. అదే నాకు ఆశ్చర్యంగాఉన్నది.

నిరం:- అయ్యో అన్యాయం. అక్కడ మీతల్లిగారు చనిపోయినారు. మిమ్ములను త్వరగా తీసికొనిపోవుటకు వచ్చాను.

భాస్క:- హా పరమేశ్వరా? నన్ను పరీక్షించుటకిదేనా సమయం. తల్లీ!

సీ॥ పసితనంబున నుగ్గుపాల్బోసి నోటన్
 పెనుగక ప్రేమతో పెంచినావు
పడిసెమైనను నాకుబట్టుచో తపియించి
 వైద్యునిదెచ్చి కాపాడినావు
అల్లరిసేయుచో మెల్లగాగమముచు
 పిలిచి యన్నమునోట బెట్టినావు
క్షణమైన చూడజాలనియెడ భయమంది
 పురిచుట్టు వెదకుచు తిరిగినావు

తే॥ గీ॥ చదువుసంధ్యలజెప్పించి సాకినావు
చనినతండ్రిని మరువగా సల్పినావు
కులము దీపింపకీర్తితో వెలసినావు
అరుగుచున్నావె సురలోకమమ్మనీవు॥

దైవమా! తుదకు తల్లిఅంత్యక్రియలకుగూడ అవకాశ మొసర్పవా?

పెరం:- అయ్యా వీరితల్లి చనిపోయింది. ఆమె దహన కార్యములైనతర్వాత మరల వీరిని తీసికొనిపోవచ్చును.

పోలీ:- వీల్లేదు. ముందుగా స్టేషనుకు వెళ్ళవలెను. అక్కడికి వచ్చి తెలుసుకోండి. అయినా జామీను ప్రస్తుతం ఇవ్వరుకూడాను. పదండి.

భాస్క:- దాసూ-

నిరం:- అయ్యో బాబూ ! మీరుపోతున్నారే. మాగతేమిటి?

వ॥ పటుదర్పంబున కష్టసౌఖ్యములలో భావింపకే దేశమం
తట సంచారమొనర్చుచూ హరిజనోద్ధారైక చిత్తార్థి న
క్కట కారాగ్రహవాసివై యరుగుచో కన్నారపీక్షించి నే
మెటు జీవింపగలారమయ్యా ! యిక మాకేదిక్కు-
సద్భాస్కరా॥

భాస్క:- (చింతతో మెదలకుండును)

నిరం:- బాబూ. పలుకరేం బాబూ ! మాగతియింతేనా ?

సీ॥ హరిజనక్షేమంబు నరయునీవరుగుచో
నికమీద మాకుదిక్కెవ్వరయ్య
ఉత్తమజ్ఞానంబు నొసగునీవేగుచో
నికమాకు సద్గురుడెవ్వడయ్య
గతిలేని దీనులగతి నీవుతరలుచో
నికమాకురక్షకుడెవ్వడయ్యా
హీనజాతులవేల్పు నీవుచేవిడుచుచో
నికమమ్ము ఊలకింతు రెవ్వరయ్య

తే॥ గీ॥ కటకటా ! యెవ్వరిక మమ్ముగాతురయ్య
ప్రేమనెవరింక మా మొరల్ విందురయ్య

ఎవరు మాన్యమూర్తికిక తపియింతురయ్యా
పలుకగదవయ్యా! మాయయ్య భాస్కరయ్యా!

భాస్క :- దాసూ. నేనేగినసూ విచారించవలదు.

శా॥ దేశంబెల్లెడ పంచమోద్ధరణసందేశంబు ప్రాపించి యా
దేశోద్ధారకుడాంధ్రకేసరియు మోతీలాల్ బోస్ బాబు లా
కాశజ్యోతిపదస్థులై దెసను యశఃకాంతుల్ ప్రసాదింపగా
దేశంబైనను జింత యేటికిటునే లేకున్న నేలోకమా!!

ఇంకనూ సజీవులైన మహామహులనేకులీయుద్యమము కొఱకు తమ జీవితాలు అంకితం చేస్తున్నారు. గాంధి మహాత్ముడు దేశసమైక్యత కొఱకై ఆత్మార్పణం చేశారు. గాంధి నశించినా గాంధీయ సిద్ధాంతం అమలు పరచ గోరిన కాంగ్రెసు ప్రభుత్వం మీఅండ నున్నది. అగ్రనాయకులున్నారు. కార్యధురంధరుల చేత నుద్యమం కొనసాగగలదు. నీవెందుకు విచారిస్తావు.

సీ॥ దేశదేశాలశాంతికి దూతయధినేత
పండితజవహార బాబులేడె?
స్వాతంత్ర్యభారత ప్రథమసారథిగ రా
ష్ట్రపతి రాజేంద్రప్రసాదులేడె?
ప్రాజ్ఞ్యశాస్త్రవేత్తోప రాష్ట్రపత్యాంధ్రతే
జస్వి రాధాకృష్ణ సఖుడులేడె?

భూదాన శ్రమదాన భూరిసంపద్దాన
పాదచారి వినోభ భావె లేడె ?

తే॥ సీ॥ మాజి సైస్రాయి ప్రముఖరాజాజి లేడె ?
రంగసుగవక్త్రాచార్య రంగలేడె ?
రెడ్డిబిడ్డడు సంజీవరెడ్డి లేడె ?
ఎందరెందరు లేరు ? నేనెంతవాడ ?

ఒక్క నా సూక్ష్మ సందేశముమాత్రం మరువకండి. అదేమందురా ?

ఉ॥ అక్షయమోక్షమీయ చర కాత్మకమైతగు గాంధినామ నే ద్వ్యక్షరిమంత్రిరాజమని తెక్కువగాదుసుమీ తలంప న ష్టాక్షరిమున్నగా వెలయు నన్నిటికన్నను తజ్జపంబునన్ రక్షణగల్గునింటికడ రచ్చలమీకు భయంబు లేదికన్॥

నిరం:- బాబూ. మీ ఆజ్ఞ శిరసావహిస్తాను. (దుఃఖిస్తూ) కాని

సీ॥ ఏనాడుభుజియించితీవు రాగులగంజి
శాల్యాన్నరుచిర భోజనమెకాని
ఏనాడుచరియించితీవు చోరులలోన
అధికవిద్యాశాలురందెకాని
ఏనాడుసల్పితివీవు బానిసపనుల్
జనులమన్ననలందుగొనుటె కాని

ఏనాడుధరియించితీవు సంకెలజోడు
లలితమా పుష్పమాలలనకాని

తే॥ గీ॥ పలువిధములైన సిరిసంపదలసతంబు
వెలసిచెఱసాలవాలు కావలసెనేను
ఆదిమాంధ్రాభివృద్ధి వగుటకతన
వైభవోపేత; గుణపూత; పరమచరిత।

భాష్య:- పిచ్చివాడా! నేను కారాగృహాని కేగుచుంటినని విచారిస్తున్నావా? అది శ్రీకృష్ణ జన్మస్థలముసుమా, అతి పవిత్రమైన స్థలం.

సీ॥ గీతారహస్య సత్కృతికర్త బాలగం
గాధరు పాదపంకజముచేత
సద్ధర్మమౌ యహింసాతత్వసిద్ధాంతి
గాంధి దివ్యాంఘ్రియుగ్మంబుచేత
జగద్ధజీవనోత్సాహియౌ చిత్తరం
జనదాసపదరజస్సమితిచేత
అధ్యాత్మికజ్ఞలోకాచార్యు డరవింద
సంయమిచరణ సంస్పర్శచేత

తే॥ గీ॥ అమలకీర్తినిగాంచి గణ్యతనుబొంది
బహుజనాకర్షణీయమై భరతసింహ
పోతములకెల్ల కేళికా భూమియగుచు
నున్న చెఱసాలపుణ్యంబు నెన్నదరమె

పోలీ:- రండి పోదాం.

భాస్క:- క్షమించండి వస్తున్నాను. (దానునుజూచి) దాసూ, వస్తాను. దుఃఖించకు.

నిరం:- చిత్రం బాబూ (భాస్కరుని జూచి) ఆహా! ఎంత అన్యాయం. ఈమహానుభావునకా యిట్టినింద! కటకటా!

సీ॥ అజ్ఞానమును బాపి విజ్ఞానమిడుగాని
జ్ఞానముడాచు నజ్ఞానిగాడు
మతదోషములమాన్పి మతము నిల్పునుగాని
మతముబోకార్చు దుర్మతుడుగాడు
పశులకు సుపక్రియిభావించునతిగాని
పశులకు నపకార పరుడుగాడు
దాతృత్వబుద్ధిచే ధరవెలయునుగాని
ఉండిపీడించు లుబ్ధుండుగాడు

తే॥ గీ॥ వీరవైష్ణవుండేగాని విరికిగాడు
ధర్మవేత్తయెగాని యధర్మిగాడు
సద్యశస్కుడుగాని దుర్జనుడుగాడు
దయనుగలవాడుగాని నిర్దయుడుగాడు

ఆశ్చర్యకరముగానే యున్నది. శాస్త్రిగారి హత్యకు కారణమేమై యుండును? విశ్వపతి పన్నాగమే

కావచ్చును. అయిన కల్యాణమ్మ యేమయినది? ఇదేదో వింతగానున్నది. ఈ దాసునికి ప్రస్తుతమేదో ఒక బాధ్యత వనికల్గినది. ఈ రహస్యము కన్గొనినగాని మాగురువునకు ముక్తి కల్గదు. దానివల్లనే కల్యాణమ్మ క్షేమమనున్నా తెలియగలదు. నిర్వహింపగలనా? భగవానుడా! నీయనుగ్రహము నాకు ప్రసాదించి నీసేవ జేసే నీభక్తుడను రక్షించు సామర్థ్యము నాకు దయ చేయుము. తల్లి! భరతమాతా! ఈ నిర్భాగ్యులగు హరిజన సంతానము నుద్ధరింప నీ హృదయమున జాలి కలుగ లేదా? తల్లీ! నీ ప్రతోపోన్నతుల విచారింప నెంతటివారికైనను శక్యముగలదా!

సీ॥ భీమార్జనాది సద్వీరుల గీర్తిచే
మహిపూజగొను వీర మాతవీవు
కాళిదాసాది సత్కవిశిఖామణులను
పాలిచ్చిపెంచిన బ్రాహ్మివీవు
వైద్యమార్తాండధన్వంతరీత్యాదుల
కభివృద్ధినిడిన వైద్యాంబవీవు
శంకరరామానుజ ప్రముఖార్యమ
తస్థాపకుల జీవధాత్రివీవు
యాజ్ఞవల్క్యాది మహామహానులను గటా
క్షించిన పరమయోగినివివీవు

తే॥ గీ॥ రాజకీయవేత్తలగన్న రమణివీవు
సత్యసంధుల మోసిన సాధ్వివీవు
కలిమికాధారమౌ రత్నగర్భవీవు
భవ్యనవ్య గుణాన్వితా ! భరతమాత॥

తల్లి నిన్ను ప్రార్థించుటది యేమనగా ?

సీ॥ అస్పృశ్యతాదోష మడుగంటగాజేసి
విజ్ఞాన మొసగూర్చి వెలయుమమ్మ
ఆంధ్రాదిమాంధ్ర మహాత్మాదీయులకు క
ల్యాణములను బారద్రోలుమమ్మ
తావకీన సుతుల దాస్యమును బాపి స్వ
రాజ్యసామ్రాజ్య సంప్రాప్తినిమ్మ
భారతీయులమించువారు లేరంచును
జగమందుగీర్తిని జాటితిమమ్మ

తే॥ గీ॥ అఖిలలోకైకవందిత ఖ్యాతిచరిత
ధైర్యమండిత యోగిసంతానకలిత
అతులితానంద భోగభాగ్యైకభరిత
భవ్యనవ్యగుణాన్విత భరతమాత॥

(నిష్క్రమింతురు)

# మా ల దా సు

తృతీయాంకము 1వ రంగము

విశ్వపత్యగృహము

(కల్యాణి, విశ్వపతి, వైరాగి)

కీర్తన

కల్యా:- ఎంతహీనురాలనైతినే ॥ఎంత॥
యేమిసేతునాహా తండ్రిబాసెనే ।ఎంత।

ఆహా నే నేమిసేయుదాననో హే మహేశ్వరి
శివశంకరీ నానాథుడెందుండెనో జాడ తెలుపువారులేరె!

(ఆలోచించి) ఇది విశ్వపతి చేసిన మోసకృత్యం. తండ్రిని హత్యచేసాడుకదా, హా తండ్రీ. నీవు కసువైనావు కదా!

తే॥ గీ॥ ఒక్క కూతురనగుటచే నెక్కువగును
ప్రేమతోడను బోషించిపెంచినావు
నాదు దౌర్భాగ్యవశముచే నన్నువిడి
దివికి జనినావె? తండ్రియేదిక్కులేక॥

నాన్న. మేనల్లుడు నిన్ను చంపుతాడని యెన్నడు తలపోయకపోతివే. దిక్కులేని ఛండాలుని బెంచావు. ఏ

విషసర్పాన్ని పెంచావో, ఆ విషసర్పమే నిన్ను కాటు వేసింది. నా ప్రియుడేమైనాడో ? హా. మనోహరా ! హరిజనోద్ధారా ! భాస్కరా ! నీవే హంతకుడవని నిన్ను జైలులో బెట్టినట్లు విశ్వపతినోట విన్నాను. నీ కెంతటి దురవస్థ సంభవించినది.

సీ॥ ప్రథముడవై పట్టభద్రుండవగుట కా
శృంఖలన్ వడియె నీచేతులకును
సంఘదోషంబుల సంస్కర్తవగుటకా ?
శృంఖలల్ వడియె నీచేతులకును
మతబహిష్కృతికి శాంతతనుగన్నందుకా
శృంఖలల్ వడియె నీచేతులకును
హరిజనోద్ధరణకై యలయుచున్నందుకా ?
శృంఖలల్ వడియె నీచేతులకును

తే॥ గీ॥ సుగుణరాశివి పరమయశోవిరాజి
తుడవు భవ్యసుజనవందితుడవు నీవు
నిందమోసితె చెరసాలబందివగుచు
హరి హరీ ? తాళనీమాటలాలకింప॥

నాజీవిత సౌఖ్యమేతీరున నుండగలదో ? ఈ దుర్మార్గుడు నన్ను గదిలో బంధించాడే ? నేనెట్లా బయట పడేది ? ఏమిచేసేది ? నన్ను రక్షించేవారెరు ?

విశ్వ:- (కల్యాణిని సమీపించి) ఏం కల్యాణి, కలవరిస్తున్నావు. భాస్కరునా ? ఇంకెక్కడి భాస్కరుడు ? దొంగల

కొట్లో గంజి తాగుతున్నాడు. పోలీసులచేత చావు దెబ్బలు తింటున్నాడు. రేపో మాపో ఉరిశిక్షకు గురి కాబోతున్నాడు. ఇంకా వస్తాడనుకున్నావా? హ్హా హ్హా హ్హా ఒకటే పోవడం వైకుంఠానికి. అదీ నా ప్రభావమే! నాతో కలహము పెట్టుకొని ఎవడైనా గెలవగలడా? కల్యాణి. నాశక్తి ఏమిటో ఇప్పటికైనా తెలిసిందా?

కల్యా:- ఛీ దుర్మార్గుడా. పెంచినమామను అన్యాయంగా చంపావు. భాస్కరుని అకారణంగా కారాగృహంలో పెట్టించావు. నీచేతిలో చిక్కానని మురుస్తున్నావు. బలవంతపు చావుకైన సిద్ధమేకాని నీకు స్వాధీనురాల నగుట కల్ల, కల్ల. నీది పాషాణహృదయం. నీకన్న కసాయివాడు మేలు. నీతో నిముసంముచ్చటించినా, నావంశ గౌరవానికే భంగం.

విశ్వ:- (రోషముతో) ఆ. యేమిటి? జాగ్రత్తగామాట్లాడు. నాప్రభావం నీకింకా బాగా తెలియలేదా? నిన్ను చంపదలిస్తే నాకు నిమిషం పట్టదు. కాని నాకోర్కె నెరవేరదు, అందుచేత నిన్ను క్షమిస్తాను. ఇంకా కొంతకాలం చూస్తాను. ఈలోపల నీవు తేల్చి చెప్పాలి. ఆపైన యేమిజరుగుతుందో ఆలోచించుకో. జాగ్రత్త.

నిరం:- (బైరాగి వేషముతో పాట)

సాముద్రీకం చదివినయట్టి రామగురుడా సీతారాం.

విశ్వ:- ఎవరో గోసాయివలె నున్నాడు. ఒక మంత్రమో, తంత్రమో చేయించి కల్యాణిని వశపరుచుకుంటాను. బాబాజీ (అని బైరాగిని పిలుచును)

బైరా:- సాముద్రీకం చదవినయట్టి, రామగురుడా సీతారాం.

| | | |
|---|---|---|
| చాలాకాలపు సాధునండీ, | ,, | ,, |
| కాశీయాత్రాకట్టానండీ | ,, | ,, |
| వచ్చేవారూ-వస్తేరండీ | ,, | ,, |
| ముందు వెనకలా సంగతులన్ని | ,, | ,, |
| చక్కగచూచి చెపుతానండి | ,, | ,, |
| బాసచేసి పలికేయెడల | ,, | ,, |
| గోసాయిమాట గొడ్డలిపెట్టూ | ,, | ,, |

విశ్వ:- బాబాజీ, ఇటురా. మీదేమతం ?

బైరా:- మాది సిద్ధయ్యగారిమతం.

విశ్వ:- చెయ్యిచూచి చెపుతావా ?

బైరా:- ఆ. నాకు సాముద్రీకం వచ్చు. నేను రామసోది చెపుతాను.

విశ్వ:- అయితే నాచెయ్యిచూచి చెప్పు.

బైరా:- చెయ్యి చూపండి. (చెయ్యిచూపి)
అమ్మా తల్లీ అంకాళమ్మా. రామగురుడా సీతారాం. పోలేరమ్మా, కొల్లేరమ్మా. తిరుగులేనిపలుకీయమ్మా పాలుతాగేకాలమందే, తల్లితోడు మీసాలయ్యా. ఆడానుంచి అండయినాడు. కురురకపోతే కూనీచేస్తిని. కాదా ? రామగురుడా సీతారాం. అవునా ?

విశ్వ:- నీవుచెప్పేది కానీయి.

బైరా:- మామకశుప్పై మనసుపడ్డవు. పొందికతేక సందులు చూస్తవు. కన్నెకుయక్షిణీ గ్రహముపట్టినా అవునా ?

విశ్వ:- అబ్బా. కానిస్తు.

బైరా:- పట్టినగాలి వదులుట కష్టము. గాలివదిలితే మేలవుతుంది. నేడే పిల్లానీదవుతుంది. విచారపడకా వినుకోవయ్యా. రామగురుడా సీతారాం.
మేడలు మిద్దెలు కట్టిస్తావు. 80 సంవత్సరాలు బ్రతుకుతావు. మట్టిపట్టికుంటే బంగారం అవుతుంది. పాడి పంటా బాగా ఉంటయి. గంపెడు పోతులు గుంపెడు బుజ్జిలు పుడతారు. బైరాగులకు బత్తెమిస్తావు. పెద్ద దొరవై పేరు తెస్తావు.

విశ్వ:- (నవ్వి) బాబాజీ. నీక్రియచేత నాకాపిల్ల వశ్యురాలయ్యేట్లు చేయగలవా ? నీకు కావలసిన డబ్బిస్తాను.

బైరా:- అయ్యా. మేము డబ్బుకోసం ఇచ్చేవాళ్ళంకాము.

మా గురువాజ్ఞప్రకారం ఇస్తాం. పావలా డబ్బులు మాత్రం పుచ్చుకుంటాను. అదీ గంజాయికే.

విశ్వ:- అట్లయితే నీవు నావద్దఉంటే రోజూగంజాయికిస్తాను. కూడు గుడ్డలకు కొఱతలేదు.

బైరా:- మాది సత్రం భోజనం మఠం నిద్రబాబూ. ఒకచోట ఉండేవాళ్ళం కామునాయనా.

విశ్వ:- అదికాదు. బాబాజీ. నీవు గట్టిగాఉండు. నీకేకొఱత చేయను. ఇది నీయిల్లులాగా నే భావించుకో.

బైరా:- అయ్యా. మీరింత బలవంత పరిస్తే మీమాట తోసి వేస్తానా? అలాగే కొద్దిరోజులుంటాను. నాకుమాత్రం పావలా యెత్తు జ్ఞానపత్రం తప్పదు. సరేనా?

విశ్వ:- ఆ. సరేనంటినిగా. ఇదిగో తీసికో (అనిపావలాయిస్తూ) మనఇంట్లో నీకేకొఱత ఉండదు.

బైరా:- జయ్ శంకర్ గురుమహారాజ్, ఆనందం. అయ్య గారూ. క్రియకష్టమంటారా?

విశ్వ:- అవశ్యం.

బైరా:- అమ్మగారెక్కడండి?

విశ్వ:- అదిగో అక్కడనే ఉన్నది.

బైరా:- తీసుకురండి. (విశ్వపతి కల్యాణిని తెచ్చును) అమ్మ గారు తమ యెదుట భయపడుతున్నదండి.

విశ్వ:- అలాగా, నీ ప్రయత్నం కానీ. నేనింతలో చుక్క వేసుకు వస్తాను.

బైరా:- చిత్తం నేను చేస్తానుగా. దయచేయండి. (కల్యాణిని జూచి) అమ్మాయిగారూ, నావంక చూడండి. నేను వారి శిష్యుణ్ణే మఠంనుంచే వస్తున్నాను. మిమ్మల్ని స్వస్తపరచడానికే వచ్చాను. (మెల్లగా) నేను దాసుని గుర్తించారా ?

కల్యా:- ఆ, దాసూ ?

బైరా:- అవునమ్మా. ఈ వేషం నీకోసమే, నాకష్టం నేటికి ఫలించింది. ఇక నేను చెప్పినట్లు నాటక మాడాలి. (చెవిలో చెప్తాను)

కల్యా:- సరేదాను. వీని స్నేహితులు చాలమంది ఉన్నారు. జాగ్రత్తగా సంచరించాలి.

విశ్వ:- (ప్రవేశించి) ఏంబాబాజీ, ఏమంటున్నది. చేసు కుంటుందా ? నవ్వుతున్నదే.

బైరా:- మీరే అడిగిచూడండి.

విశ్వ:- ఏం కల్యాణి. ఏమంటావు ? చేసుకుంటావా ? తల కాయ వొంచుకూర్చున్నావేం. సిగ్గొచ్చిందా ? పరాయవాళ్లు ఎవరు ? అరవ్వంత మాటరానిద్దూ.

కల్యా:- చాలెస్తు బావా. (నవ్వుచూ)

విశ్వ:- ఏం నవ్వుతున్నావు. చేసికుంటావా? బావా అంటున్నావే!

కల్యా:- ఊ (నవ్వుతూ తలవాల్చును)

విశ్వ:- బలేవహ్వా. ఏమి ఈ క్రియా ప్రభావం. క్షణంలో కల్యాణిని మార్చివేసింది. ఆహా, ఎంతగొప్పక్రియ. ఈ సాధు రావడం నాఅదృష్టం. (కల్యాణినిజూచి) వివాహం రేపు సరేనా?

బైరా:- ఇప్పుడుకాదు. మిమ్మల్ని అమ్మగారు చేసుకోవడం నిశ్చయం. ఇప్పుడు మంత్రబలంచేత కట్టబడి ఉన్నది. ఇక నెలరోజులు నిదానించండి. అప్పుడామె తనంతట తానే వరించేట్టు చేస్తాను.

విశ్వ:- అయితే సరే. భలేషావా.

బైరా:- (కల్యాణితో) అమ్మా, మీరు లోపలికెళ్ళండి. (విశ్వపతితో) గొప్ప యక్షిణీ గ్రహమండి. ఇంతకూ మీరు గొప్ప అదృష్టవంతులు. పెట్టిపుట్టారు.

విశ్వ:- బాబాజీ! ఇదంతా నీమహిమే. నీకెంతఇచ్చినా ఋణం తీరదు. రేపు ముందే డబ్బిస్తాను. ఒక్కసారి ఒక మణుగు తెచ్చుకొని వాడుకో, తెలిసిందా, బాబాజీ, ఇంకేమి కావాలి?

బైరా:- నాకేమి అవసరములేదు బాబూ. మీరు శాశ్వత సుఖం అనుభవిస్తే నాకదేచాలు.

విశ్వ:- మంచిసాధువు బాబాజీ. నీబోటివాడు నాకుదొరకడం నాఅదృష్టమే.

బైరా:- చిత్తం. నాఅదృష్టంపండే వచ్చాను. మీబోటివారికి శాశ్వతానందము జేకూర్చడమే నాకోర్కె. అదే నా ఆనందం.

విశ్వ:- మంచి సమయంలో కన్పించావు, బాబాజీ! నీవు లేకుంటే ఈ కల్యాణివల్ల చాల అవస్థలు పడేవాణ్ణి.

బైరా:- మీ అవస్థలు తీర్చడానికే నారాక. అది గ్రహించే సమయంచూచి వచ్చాను. నేవచ్చినపని నెరవేరింది. గనుక నాకున్ను ఇది మంచి సమయంగానే ఉన్నది.

విశ్వ:- బాబాజీ మళ్ళీ కన్పిస్తాను.

బైరా:- చిత్తం. పోయిరండి. (కొంచెమాగి) ఓ పరాత్పరా! ఏమయ్యా నీపరిపాలన, దుష్ట శిక్షణ, శిష్టరక్షణ ధర్మ పాలన, అధర్మధ్వంసన చేయుదువు. నీవే యిట్టి వ్యత్యాసము చేయుచుందువు.

సీ॥ దానధర్మముసేయ దాతయౌను బికారి
అతికృపణుండు లక్షాధికారి
భువిసత్యవాది లోకవిరోధి అపరాధి
కూటసాక్ష్యముకూయు కుమతిసుమతి
బైరాగియేమహా భక్తుండురక్తుండు
దైవభక్తుడు, వేషధారిహారి

హంతకుల్ సద్దోషు లతిహితభాషులు
సాధుసమ్మనులు శిక్షార్హ జనులు
తే॥గీ॥ అకట ! దైవమ ! ఈదురన్యాయమేల ?
చెడ్డవారలపైకెత్తి చెలగిమంచి
వారలనధోగతిని ముంచివైచదీవు
తెలిపి యొకసారి నన్ ప్రబోధింపుమయ్య॥

(సేవకుడు ప్రవేశించును)

సేవ:- అయ్యా విశ్వపతిగారున్నారా ?

బైరా:- ఎవరునీవు ?

సేవ:- నేను మోహన బలరాముల స్నేహితుణ్ణి.

బైరా:- ఎందుకొచ్చావు ?

సేవ:- వారు విశ్వపతిగారికి ఉత్తరం రాసి పంపారు.

బైరా:- ఇటు తే (అనితీసికొని చదువుచూ) అబ్బీ. ఈఉత్తరం విశ్వపతిగారికిస్తాను.

విశ్వ:- (ప్రవేశించును)

బైరా:- అయ్యా ఎవరో ఉత్తరం ఇచ్చారండి, ఇదిగో.

విశ్వ:- బాబాజీ, ఆనందంలో మున్నాను. తెలిసిందా. స్వర్గానికి బెత్తెడేమోకం. నీవేమిటి ? నేనేమిటి ? నీకూనాకు భేదమేమిటి ? చదువు వింటాను.

బైరా:- (ఉత్తరంచదువును) శ్రీ శ్రీ విశ్వపతిగారికి-మోహన్ బలరాములు నమస్కరించి వ్రాయునది:-

అయ్యా. మాకు మీమామగార్ని చంపినసందర్భములో ఇస్తానన్న వెయ్యిరూపాయిలకుగాను మాకు ముట్టినది రు. 600/ లు మాత్రం. మిగతా రు. 400/లు ఈమనిషిద్వారా పంపగోరుచున్నాము. జరూరు.

1 మోహన్ వ్రాలు

2. బలరాము వ్రాలు

విశ్వ:- ఇదేనా! సరే. డబ్బుపంపిస్తానని వ్రాయి. నేనుదస్కతు పెడతాను.

బైరా:- ఉత్తరంవ్రాసి విశ్వపతిచేత సంతకంచేయించును)

విశ్వ:- నేను తూలిపోతున్నాను. కాసేపు పడుకుంటాను. ఇక్కడ పనులు నీవు చూస్తుండు. ఆమాలదాడి దె నిరంజనాయి ఇటుప్రక్కకువస్తే తన్ని పంపించు. వాడు దొంగ వేషముతో గస్తీతిరుగుతున్నాడని విన్నాను. పోతాను. (కల్యాణి నవ్వబోగా దాసు ఆపుటకు సైగ చేయును)

బైరా:- పంతులుగారు మంచి ఆనందంలోనున్నారు. ఇంతకూ అనుభవించే రోజులు, నోచుకుపుట్టారు. (విశ్వపతి వెళ్ళినతర్వాత) ఇటువంటి త్రాగుబోతులకు దేవుడజ్ఞానము పెట్టకపోతే దేశాన్ని బ్రతుకనిస్తారా?

చతుర్థాంకము 2వ రంగము

## జైలు

(భాస్కరుడు, పోలీసు)

భాస్క:- అకటా ! ఎట్టి ఆపద తటస్థించినది. ఏ హస్తములు పంచమోద్ధరణకై వినియోగించానో: ఏ హస్తము లతో నాహృదయేశ్వరి యగు కల్యాణి కంఠంలో సూత్రము గట్టదలచానో, ఏ హస్తములతో అతిథి అభ్యాగతులకు బీదసాదలకు దానము లొసగితినో, ఆ హస్తములకేనా నేడు శృంఖలలు. కటకటా !

సీ॥ పరకాంతజూచి సోదరియనుటయె కాని
కలనైన భ్రమియించి తలచియెఱుగ
సంఘదోషంబుల జంప నెంచితిగాని
సంఘాభివృద్ధినే జంపియెఱుగ
విద్యాధికుడనాచు వినుతికెక్కితిగాని
చెలరేగి బుధులదూషించియెఱుగ
నిమ్నజాతులవృద్ధి నెపుడుగోరితిగాని
అగ్రజాతులధర్మ మణచియెఱుగ

తే॥ గీ॥ పరులకపకారమునుజేయు భావమెఱుగ
హాస్యమునకైన ననృతంబునాడియెఱుగ
దయనుజరియింతుగాని నిర్దయత నెఱుగ
నిట్టినను బట్టి చెఱబెట్టు టేమొ నెఱుగ॥

నా ఉద్యమానికి అంతరాయం కల్గింది. కష్టపరంపర యొకటి వెంట నొకటి వస్తున్నది.

సీ॥ కులమంతు లోకాపవాదములు వ్యాపింపగా
మురళీధరుడు బహిష్కరణ జేసె
తనకెద్దివారికిన దనయునకై దాచి
దయతోడ బెంచు నా తల్లి చనియె
ననుగోరి మదిని దేవునివలె భావించు
లావణ్యయువతి కల్యాణి బాసె
నిరపరాధిని నన్ను నేరస్థునిగ జేయ
కారాగృహంబున గ్రాలవలసె

తే॥ గీ॥ నాదు ప్రోద్యమమును విడనాడవలసె
కూడునీళ్ళును లేక నల్లాడవలసె
దిక్కులేనట్టి పక్షినై తిరుగవలసె
కటకటా! దైవమా నీకు కరుణలేదె॥

తండ్రీ, దేవాదిదేవా! సకలలోకములను బోషించు నీవు నన్ను కష్టపెట్టుట ధర్మమా? భక్తులకు చేసే ఉపకారమిదేనా తండ్రీ? నన్ను గాపాడుట భారమని తోచినదా? లేక నా మొర వినజాలకున్నావా? దుర్మార్గుడైన విశ్వపతికి తోడ్పడ్డావు. దుర్మార్గమన్న ఎఱుగని నన్ను బాధపెడుతున్నావు. ఇదేనా నీతీర్పు? నీవే యిలా తీరిస్తే ప్రపంచంలో న్యాయముంటుందా?

ధర్మశాస్త్రిలింటయ్యా స్వామీ? హరిజనోద్యమ మెట్లున్నదో కదా? ఉద్యమమా నీఅభ్యుదయముగోరి నే నీ యిక్కట్లకు గురి అవుతున్నాను.

తే॥ గీ॥ అఖిలలోకేశ! సర్వేశ యఘవినాశ
సాధుజనపోష! శుభవేష సత్యభాష
అస్మదీయోద్యమోన్నతి నాదరింపు
శరణుశరణు మృత్యుంజయ శరణుశరణు

పోలీ:- ఈనాడు నీవిచారణదినం, లేచిబయలుదేరు,

భాస్క:- దైవమా! ఈ జీవితఘటానికి రేపు అనేదిఉండదు కాబోలు. నామరణానంతరమైన నా నిర్దోషిత్వమును ఋజువు చేసే భారం నీమీదనున్నది. (పోలీసులతో) అయ్యా సిద్ధముగా నున్నాను. పదండి.

(నిష్క్రమింతురు)

---

చతుర్థాంకము 3వ రంగము

వీ ధి

(విశ్వపతి, వైరాగి, మోహన్, బలరాముడు)

విశ్వ:- బాబాజీ, ఈనాడు విచారణ వాయిదా. నేను కోర్టుకు వెళ్లాలి. ఇకనీకు నేను వేరే చెప్పేదేముంది? నీపనిలో

మాత్రం జాగ్రత్తసుమా! నిన్ను నమ్మి కల్యాణిసొప్ప జెప్పి పోతున్నాను.

వైరా:- బాబూ! నాకింతగా చెప్పాల్నా. ఆసంగతి నాకు తెలియదూ. నేను సమస్తమూ సరిచూచుకుంటాను. ఈ వేళుముక్క—మాత్రం మీవద్ద సుంచండి. మీ అభీష్టం సిద్ధిస్తుంది.

విశ్వా:- నీ కృతజ్ఞతకు పాత్రుణ్ణి. నీ మేలు మరువలేను. అన్నిటికి నిమ్మ నిన్నే నమ్మాను.

(మోహన్, బలరాములు ప్రవేశము)

మోహన్:- విశ్వపతి. నీతో రహస్యంగా మాట్లాడాలి.

విశ్వ:- ఫరవాలేదు, చెప్పు మోహన్. ఇక్కడ పరాయివాళ్ళు లేరు. వీరు మన గురువుగారే. సిద్ధయ్యగారి మరష్ఠులు. మన శ్రేయోభిలాషులు. వీరి దయవల్లనే మా కల్యాణి నాకు వశ్యురాలయినది.

మోహన్:- అట్లాగా చెప్పవు, సంగతి. అయితే మిగతా పైకం సంగతి ఏమిచేసినట్లు, పంపలేదేం?

విశ్వ:- చేతిలోకింకా రాలేదు. మిత్రమా - చూస్తాలే కొద్ది రోజుల్లో.

బల:- ఇంకా నాయిదా లేనా? మంచివాడవు. ఎన్ని నెలలు

ఆగడం? మాకవసరాలు లేవనుకున్నావా? చూస్తానంటే కాదు. నీకోసమే వస్తున్నాము. తప్పనిసరిగా చూడాః.

విశ్వ:- బలరాం ఇప్పుడు దొరకడు. రెండ్రోజులాగండి. తప్పక ఇస్తాను. ఈరోజు భాస్కరుని విచారణ. తెలుసుగా మీకు. ఈఅట్టహాసమంతా అక్కడికే. మీరు రారూ?

మోహన్:- మేముచూస్తాం. ఇష్టమైతే వచ్చేది లేకపోతే లేదు. నీవు అంతా అయినాక సున్నాచుడితే చేసే దేమిటి? ఈరోజు ఇస్తావా, వస్తాము. లేకపోతే మా సాక్ష్యం తిరగబడుతుంది ఆలోచించుకో బాగా!

విశ్వ:- మిత్రమా; అంతదాకా రానిస్తానూ. తల తాకట్టుపెట్టి అయినా తెచ్చి సరిచేస్తాను. పూర్వపుస్నేహం కాస్త పాటించండి. అంత తొందరపడతారేం మీతో చాల గ్రంథముంది. ఇదిగో ఈవందరూపాయిలు తీసికోండి. మిగతాది రేపు మీపట్లో సద్దుతాను. నన్ను నమ్మండి.

మోహన్:- (పైకంతీసుకొని) సరే పోతూ ఉండండి. మేము అన్నంతిని వస్తాము.

విశ్వ:- త్వరగా రండిసుమా. కోర్టు జడ్జిగారు పైముగాకముందే వస్తారట.

బల:- క్షణంలో రామూ. మీరు వెళ్ళుతుండండి. (అంటూ వెళ్ళేదరు)

విశ్వ:- (బైరాగితో) రండి, బాబాజీ. నీవిచ్చిన వేపతో భాగ్యానికి ఉరిశిక్ష పడుతుందా?

బైరా:- తప్పకుండా! వేరుమాత్రం పారవేయకండి. మీరు కైఫీయత్తు బాగా యిచ్చారండి.

విశ్వ:- బాబాజీ, అంతా నీమహిమే సెలవా?

బైరా:- (నవ్వుతూ) మంచిది. అట్లాగే చేయండి. నేటితో మీపని పూర్తిఅవుతుంది. భగవంతుడుమీయెడ కన్ను తెరిచాడు నన్నుమాత్రం మరువకండి.

విశ్వ:- నిన్ను చస్తేమరుస్తాను?

బైరా:- అప్పటికీ మరువరు? నామీద ఎంతదయ?

విశ్వ:- నాకు వేళఅయింది. వస్తాను.

బైరా:- మంచిది, వెళ్ళండి. ఉత్తరపు దిక్కుగా వెళ్ళండి. మీకుశుభంఅవుతుంది. మీపని త్వరలో నెరవేరుతుంది. (విశ్వపతి వెళ్ళినపిమ్మట)

కీర్తన

మాయానటనమిక సాగునా?
కుమతులచేతలు - క్రూరకృత్యములు

సతతముసఫలమె యగునా ॥మాయా॥
దైవములేడా ? భక్తులువేడా ?
మొరలనువినడా ? దయజూడరాడా ? ॥మాయా॥

(నిష్క్రమింతురు)

---

# మాలదాసు

పంచమాంకము 1వ రంగము

(Session Court Judge, 4 assessors, S. I. of police
2 Constables, P. P. Vakil,)

(భాస్కరుడు, విశ్వపతి, వైరాగి కల్యాణి,)

Public Prosecutor, — సుబ్బారావు.
Vakil for accused — రామారావు.

(పబ్లిక్ ప్రాసిక్యూటరు చార్జిషీటు చదువును.)

1 నేరముజరిగిన తేది 21-1-51

2 నేరంజరిగినసమయం-రాత్రి 12-30 నిమిషములకు

3 నేరముజరిగినచోటు - రామచంద్రపురంతాలూకాభీమవరం గ్రామంలో మురళీధరశాస్త్రిగారిగృహం.

4 ముద్దాయి భాస్కరరావు. వయస్సు 25 సం॥లు బ్రాహ్మణుడు వృత్తి ఉపాధ్యాయవృత్తి.

5 నేరవివరం: (Honourable judge and assessors)

ది 21-1-51 వ తారీఖున రాత్రి కాలమందు ముద్దాయి మురళీధరశాస్త్రి యింట్లో ప్రవేశించుటవల్ల ఐ. పి. సి. 447-448 శెక్షన్సుక్రింద అక్రమ ప్రవేశానికి శిక్షితుడగుతున్నాడు. అట్లాప్రవేశించి శాస్త్రిగారి కుమార్తె కల్యాణిని

తనకిచ్చి చేయలేదనే కార్పణ్యంచేతను తన్ను సంఘంలో నుండి శాస్త్రిగారు వెలిబెట్టిన క్రౌర్యంచేతనున్ను 8 అంగుళముల పొడవైన ఈనే చూపెడి కత్తితో గుండెమీద, ఒక పోటున్నూ గొంతుమీద రెండు పోట్లున్నూ పొడిచి మురళీధర శాస్త్రిగారిని కూనీ చేయవలెనను దురుద్దేశ్యముతో చంపాడు. అందువల్ల ముద్దాయి 443-447-302 శెక్షన్ల క్రింద నేరస్తుడగుచున్నాడు. కూనీ జరిగిన వెంటనే పి. డబ్లియు 1 పోలీసుస్టేషనుకు పరుగెత్తి పి. డబ్లియు 2 తో రిపోర్టు చేసాడు. పి. డబ్లియు 2 మురళీధరశాస్త్రిగారి ఇంటికి వెళ్ళి చూడగా యింటి తలుపులు బిగించి యుండుటయూ, తలుపులు భాస్కరరావు ఈనే చూపెడి కత్తిని చేత పుచ్చుకొని రౌద్రాకారముతో పెట్టెలు వెదకుతూ కనుపడ్డాడు. కనుక ముద్దాయి 448-447-302-449-451 శెక్షన్ల క్రింద నేరస్తుడగుతున్నాడు.

జడ్జి:- (ముద్దాయి నుద్దేశించి) నీవు 447 -448-302-449-451 శెక్షన్ల క్రింద నేరాన్ని ఒప్పుకుంటావా?

భాస్క:- నేను నేరాన్ని ఒప్పుకోను,

(జవాను విశ్వపతిని 3 సాక్షి కేక వేయును)

ప్రాసి:- నీ పేరేమి?

విశ్వ:- విశ్వపతి.

ప్రాసి:- నీకు మురళీధరశాస్త్రిగారేమవుతారు?

విశ్వ:- మేనమామ.

ప్రాసి:- కల్యాణిని మురళీధరరావుగారెప్పుడైన ముద్దాయికివ్వ నిశ్చయించాడా ?

విశ్వ:- ఒకసారి యివ్వ నిశ్చయించాడు.

ప్రాసి:- ముద్దాయిని మురళీధరశాస్త్రిగారు కులమునుండి బహిష్కరించాడా ?

విశ్వ:- అవును.

ప్రాసి:- ఎందుచేత ?

విశ్వ:- బ్రాహ్మణ పద్ధతులకు విరుద్ధంగా పంచములతో కలిసి మెలిసి తిరుగుచుండుటచేత.

ప్రాసి:- నీవు హత్యజరిగిననాటి రాత్రి యెన్నింటికి నిద్రపోయినావు ?

విశ్వ:- రాత్రి 10 గంటలకు.

ప్రాసి:- మురళీధరశాస్త్రిగారెక్కడ నిద్రపోయినారు ?

విశ్వ:- నే పండుకున్న ప్రక్కగదిలో.

ప్రాసి:- తరువాత యేమిజరిగినది ?

విశ్వ:- ఒంటిగంట ఆచార్యుల భాస్కరరావు కత్తితెచ్చి మా మామను పొడిచి చంపాడు. విశ్వపతి, విశ్వపతి

"భాస్కరుడు చంపుతున్నాడు."రక్షించు రక్షించు" అని పెద్దకేక వేసాడు. నేను కన్నులు తెరిచి పోయిచూస్తే [illegible]. నాగుండె దడ దడ కొట్టుకోవ సాగింది. కల్యాణి నాకు కన్పించలేదు. నన్నుగూడ చంపుతాడనే భయముతో సబ్ఇనస్పెక్టరు గారిని పిలుచుకొని వచ్చాను.

(P. P. Sits down, Vakil for accused crosses)

వకీ:- నీవు deceased పిల్లనిచ్చి వివాహము చేయడానికి యెవ్వడైనా ప్రయత్నించాడా?

విశ్వ:- లేదు.

వకీ:- ఎందుచేత?

విశ్వ:- ఏమో నాకు తెలియదు.

వకీ:- నీవు వైన్ కాఫీ సాంబారు మాదిరిగా త్రాగుతావని విని మామ అన్నాడుకదూ!

ప్రాసి:- Mr. Ramarao, ఈ question చాల irrelevant

వకీ:- No. It is quite possible that the deceased did not give his daughter under these conditions.

విశ్వ:- అయ్యా, నేను వైను త్రాగను. గియును త్రాగను.

వకీ - కల్యాణిని భాస్కరునికిచ్చే సంబంధములో మీ మామ యెప్పుడైనా నీతో సంప్రదించాడా ?

విశ్వ:- లేదు.

వకీ:- అయితే ఇందాక నీస్టేటుమెంటులో కల్యాణిని భాస్కరుని కిచ్చే యేర్పాటు [illegible] ఉద్దేశించాడని నీ కెట్లు తెలుసు ?

విశ్వ:- నా కితరులు చెప్పుటవలన తెలిసినది.

వకీ:- అయితే నీకు మీ మామకు సృతి సరిగా లేనట్లేనా ?

ప్రాసి:- your honour! ఇది leading question అండి.

జడ్జి:- కావచ్చును, కాని ఈ ప్రశ్నకువచ్చు answer కేసుకు relevantఅని నమ్ముతాను. రామారావుగారు, ఈ ప్రశ్న ఇంకొక రీతిగా అడగండి.

వకీ:- yes, your honour (విశ్వపతినిజూచి) నీతో మీ మామగారు చచ్చేంతవరకు అనుకూలముగా నుండి పనిపాటలు చెప్పుతుండేవాడేనా ?

విశ్వ:- అనుకూలము లేకేమండీ ! నేను ఆయనకు ఎంతరాత్రి అయినా వెళ్ళి పక్క దులిపివేస్తేకాని పడుకుండేవాడు కాడు.

వకీ:- (నవ్వుతూ) అయితే పక్కవేసే అలవాటున్న దానికి !

విశ్వ:- అంటే నాఉద్దేశ్యం-

జడ్జి:- Mr Ramarao! your question is irrelevant.

వకీ:- yes your honour (విశ్వపతినిజూచి) భాస్కరరావు మీమామను కత్తితో పొడవడం చూచావా ?

విశ్వ:- చూచాను, తలమీద పొడవడం చూచాను. ఆ- కాదు-వీపున.

జడ్జి:- తడబడకు, ఆలోచించి చెప్పు.

విశ్వ:- (ఆలోచించి) ఆ, వీపుననే.

వకీ:- సరే ముద్దాయి గుండెమీద పొడుచుట చూచావా ?

విశ్వ:- ఆ, చూచాను,

వకీ:- ఎన్నిపోట్లు పొడుచుట చూచావు ?

విశ్వ:- (ఆలోచించి) రెండుపోట్లు.

వకీ:- తరువాత ?

విశ్వ:- ఒకటి గొంతుమీద.

వకీ:- ఈపోట్లు పొడిచినంతసేపు నీవు కల్యాణిని విలాసంగా చూస్తున్నావా !

విశ్వ - భయపడి బయటికివచ్చాను.

వకీ:- మరి బయటికివచ్చి పోట్లుపొడుచుట ఎట్లాచూచావు ?

విశ్వ:- తలుపు సందుల్లోగుండా చూచాను.

వకీ:- ఇందాక పోట్లు పొడుచుట లోపలినుండి చూచానని చెప్పావే ?

విశ్వ:- అది పొరపాటు. నాటిహత్య తలిస్తే గుండె బ్రద్దలగు తున్నది. మాటలు తడబడుతున్నయి.

జడ్జి:- ఏమిఫరవాలేదు. భయపడక శాంతంగా చెప్పు.

వకీ:- పిమ్మట ఏమిచేసావు ?

విశ్వ:- ఇనస్పెక్టరువద్దకు పరుగెత్తాను.

వకీ:- తలుపు గొళ్లెంవేసింది ఎప్పుడు ?

విశ్వ:- నేను పోలీసుకచ్చేరికి పోయేటప్పుడు.

వకీ:- ఆహా ! ప్రియమైన మేనమామను సంబంధబాంధవ్యము లేని భాస్కరరావు వచ్చి పీపున ఒకపోటున్నూ గుండె మీాద రెండు పోట్లున్నూ, గొంతుమీాద ఒక పోటున్నూ పొడుచుట కళ్ళతో జూచి యేమి మాట్లాడకుండ శాంతంగా కచ్చేరికి వెళ్ళి సబ్ ఇన స్పెక్టరుగారికి రిపోర్టు చేసానని చెపుతున్నావు. చాల అసంభవం. ఇక దిగిపోవచ్చు. (విశ్వపతి దిగిపోవును)

(ఇనస్పెక్టరు)

(ప్రమాణము చేసినతర్వాత బెంచి గుమాస్తా పేరు తండ్రిపేరు, వయస్సు, వృత్తి అడుగును.)

ప్రాసి:- నీవు 23-1-51 వ తేదీన కచ్చేరిలో 12-30 నిమిష ములకు ఏమిచేస్తున్నావు ?

ఇన్:- ముఖ్యమైన కేసులనుగూర్చి files చూచుకుంటు న్నాను.

ప్రాసి:- అప్పుడు నీవద్దకు ఎవరు వచ్చారు?

ఇన్:- విశ్వపతి.

ప్రాసి:- వచ్చి ఏమిచేసాడు?

ఇన్:- ఈ కాగితములోనున్న స్టేటుమెంటు (statement) ఇచ్చాడు.

ప్రాసి:- తరువాత నీవేమి చేసావు?

ఇన్:- నేను వెంటనే ఇద్దరు పోలీసులను తీసికొని మురళీధర శాస్త్రిగారి ఇంటికివెళ్ళి విశ్వపతిగారు చూపించిన ఉత్తరపు గదికివెళ్ళి వాకిటిముందు నిలబడ్డాను. నేను వెళ్ళేసరికి అక్కడ మోహన్ బలరాములు గ్రామంలో ఉన్న పెద్దమనుష్యులు వాకిటముందు నిల బడ్డారు.

ప్రాసి:- తరువాత ఏమి జరిగినది?

ఇన్:- నేను తలుపుగొళ్ళెముతీసి లోపలికి ప్రవేశించే సరికి భాస్కరరావు రక్తసిక్త కత్తి చేతిలో బుచ్చుకొని పెట్టిలు వెదకడము, మురళీధరశాస్త్రి ప్రాణాలుపోయి పడిఉండటము చూచాను.

ప్రాసి:- వెంటనే భాస్కరరావును అరెష్టుచేసావా?

ఇన్:- చేసాను.

(P· P. sits down. Vakil for accused crosses)

వకీ:- చూడండి ఇన్స్పెక్టరుగారూ. మీకు (service) సర్వీసు ఎంత?

ఇన్:- పన్నెండు సంవత్సరములు.

వకీ:- ఈ 12 సంవత్సరములు రాత్రి పన్నెండు గంటలవరకు కచ్చేరి కనిపెట్టుకొని ఉండేవారేనా?

ఇన్:- ముఖ్యమైన కేసులలో మాత్రం ఉంటాను.

వకీ - ఇది ముఖ్యమైన కేసని నమ్ముతావా?

ఇన్;- నమ్ముతాను.

వకీ;- అయితే ముందు రాబోయే ముఖ్యమైన కేసులలో గూడ 12 గం॥ ల వరకు కచ్చేరిని కనిపెట్టుకొని ఉంటావా?

ఇన్:- అదిగాదండి నా అభిప్రాయం. అప్పటికి file అయిన ముఖ్యమైన కేసులగురించి విచారిస్తాను.

వకీ;- మీరు ఇదివరకెప్పుడైనా, ప్రతివాదుల వద్దనుండి నడి రాత్రుళ్లు complaints పుచ్చుకున్నారా?

ఇన్;- (ఆలోచించి) ఎప్పుడు పడలేదండి ఈసారితప్ప.

వకీ:- విశ్వపతిని మీరిదివరకెరుగుదురా?

ఇ:- ఎరుగను.

వకీ.- పోనీయి. మురళీధరశాస్త్రిగారిని ఎరుగుదురా ?

ఇ:- ఎరుగుదును.

వకీ:- వారింటికి మీరు వెళ్ళుచుండేవారేనా ?

ఇ:- లేదు.

వకీ:- అయితే మురళీధరశాస్త్రిగారికి మీకు పరిచయమెట్లా?

జడ్జి:- ఈ question వల్ల Caseకు utility లేదు. కేసు merits మీద ప్రశ్నించండి.

వకీ:- yes, your honour (తిరిగి) గది తలుపువద్ద ఎంతమంది గుమిగూడి ఉన్నారు ?

ఇ:- షుమారు పదిమంది.

వకీ:- వారంతా యెందుకున్నారు ?

ఇ:- నాకోఅకని నేను వారివల్ల గ్రహించాను.

వకీ:- మీరు తలుపు తీసేసరికి భాస్కరరావుగారి చేతిలో ఏమిఉన్నట్లు చూసారు ?

ఇ:- ఒక కత్తి.

వకీ:- ఆగదికి ఏవైపునైన తలుపులు కిటికీలున్నయ్యా ?

ఇ:- ఏమో నాకుజ్ఞాపకంలేదు.

వకీ:- గదిలో పెట్టెలున్నయ్యా?

ఇన్:- రెండు పెట్టెలున్నవి,

వకీ:- I pray your honour the boxes may be brought to the court

జడ్జి:- why ?

వకీ:- కత్తివుంటే డబ్బుకోసం, ఆ కత్తితో భాస్కరుడు పెట్టెలు కొట్టి ఉండాలి. అదిగాక తప్పించుకొనుటకు ఆగడికిటికీలు తలుపులు పొడిచి యుండాలి. Public Prosecutor గారి చార్జిలోను, ఇనస్పెక్టరుగారి స్టేటుమెంటులోను ఈ కేసుకు సంబంధించిన సాక్ష్యం యెక్కడ కన్పడలేదు. ఈ కేసు చాల డౌట్‌ఫుల్‌గా నున్నది గనుక ఆ బెనిఫిట్ ఆఫ్ డౌట్ ను ఎక్యూజుడ్ కిప్పించమని నా ప్రార్థన. (తిరుగుతూ) ఇనస్పెక్టరు గారూ, మీరు దిగిపోవచ్చును,

జడ్జి:- (కొంచెమాగి ముద్దాయినిజూచి) నీవు 448-447-307-449-451 సెక్షన్ల క్రింద నేరము చేసావని నమ్ముతున్నాను. నీకు ఉత్తరసాక్ష్యముంటే హాజరుపెట్టుకోవచ్చును. ఉత్తరసాక్ష్యం కోసం వాయిదా కోరతావా ?

భాస్క:- దేవా, నాకు ఉత్తరసాక్షులు లేరు. సర్వలోకములకును సాక్షీభూతుడైన భగవంతుడే నాకు సాక్షి.

నాకు వాయిదాతో గూడ నిమిత్తంలేదు. కాని నే చెప్పబోవునదేమనగా హరిజనోద్ధారకుడగు శ్రీ హరి సాక్షిగా నేను నిరపరాధిని. ఈ హిందూ ప్రపంచంలో పెక్కు దరిద్రజీవులు పల్లెలలోను, పట్టణములలోను హరిజనులను పేరుతో దురవస్థలలో మునుగుచుండుట గాంచి వారి ఉద్ధరణ నిమిత్తం పనిచేయుచుండు ఈ కామరహితజీవికి ద్రవ్యముపైగాని, మురళీధరశాస్త్రి సంహారముపైగాని వాంఛ యున్నదనుట కేవలము అసంభవము. అయినను "శ్రేయాంసిబహువిఘ్నాని" అను లోకోక్తి ననుసరించి ఈ నా ఉద్యమమునకు ఈ వైపరీత్యమొక ఆటంకమని తలుస్తాను. నాకెన్న డును శాస్త్రియందుగాని, వారి మతాభిప్రాయులందు గాని ద్వేషములేదు. ఇక మీదగూడ నుండబోదు. అకారణముగా నామీద నేరము మోపుతున్న సజీవు లైన ఇనస్పెక్టరు యందుగాని, విశ్వపతి యందుగాని నాకు ద్వేషములేదు. హరిజన ప్రేమయే హృదయ మంతయు మూర్తీభవించినది. మరియొక భావము నా హృదయమందెచటను గానరాదు. ఏదయామయుడు నన్ను మిమ్ములను సృజించెనో, ఎవ్వడు సర్వజీవు లందును సూక్ష్మరూపధారియై వర్తిల్లుచుండెనో అట్టి వాడు నిరపరాధిఅగు నన్ను పోషించి న్యాయ ధర్మ మును ఉద్బోధించుగాక, నాఉద్యమము కొనసాగించు

గాక. హిందూదేశమందున్న 7 కోట్ల హారిజనుల బాధ
లను బోకార్చి రక్షించు నాక.

ప్రాసి:- ఆ హా! ఏమి ఈదైవభక్తి?

జడ్జి - I now close the trial. (యసనత్సును జూచి)
Gentlemen of the Jury . మీఅభిప్రాయం. ?

1- ఎ:- ముద్దాయి కూనీక్రింద నేరస్తుడని నేను నమ్ముతాను

2- ఎ:- ముద్దాయి మురళీధరశాస్త్రిగారి ధనమపహరింప వలె
నని ఉద్దేశ్యముతో కూనీచేసాడని నమ్ముతాను.

3- ఎ:- తనను వెలిబెట్టిన కార్పణ్యంతో ముద్దాయి కూనీ
నేరముగావించినాడని నమ్ముతాను.

4- ఎ:- మురళీధరశాస్త్రిగారి కుమార్తెను తర్వాత వివాహ
మాడదలచి ముద్దాయి కూనీనేరము చేసినాడు.

తీర్పు

జడ్జి:- ముద్దాయికిని మురళీధరశాస్త్రిగారికిని బహుకాలము
నుండి విరోధమనుమాటకు సందియము లేదు. ముద్దా
యిని మురళీధరుడు కొలది కాలము క్రిందటనే వెలి
బెట్టినాడు. గ్రామంలో భాస్కరునికి గౌరవం లేకుండా
చేసాడు. ఇచ్చెదనన్న పిల్లనుఇవ్వక ముద్దాయిమనస్సు
కష్టపెట్టినాడు. ముద్దాయి విద్యాబుద్ధులు గలవాడైె
నను ఎమోషనల్ యూత్ అయినవాడుకాబట్టి మురళీ

ధరుని హత్యగావించి యుండును. ముద్దాయి కూనీ నేరముక్రింద దోషి యని కేసు గట్టిగా నమ్మి ముద్దాయికి ది 1-12-51 వ తారీఖున పగలు 11 గం॥ లకు రాజమండ్రి సెంట్రల్ జైలులో

నిరం:- (పరుగిడుచు) ఆగండి. ఆగండి. భాస్కర పంతులు నిర్దోషి. నిర్దోషి దోషి విశ్వపతి.

వకీ:- డేంజర్. డేంజర్.

జడ్జి:- వాట్ ఇజ్ ఇట్ ?

వకీ:- ఎవరో యువకుడున్నా, ఒక యువతియున్నా భీత చేతస్కులై లోనికి వస్తున్నారు. వారిమనవి ఆలకింపుడని నా ప్రార్థన.

నిరం:- (జడ్జినిజూచి) న్యాయాధిపా 'నమస్కారము' విశ్వపతి ద్రోహి ముందాతనికి సంకెలువేసినచో మీకు అతని చరిత్ర పుట్టుకనుండి చెప్పగలను.

జడ్జి:- నీవు చెప్పవలసినదేదో చెప్పుము. పోలీసులారా! విశ్వపతిని పారిపోనీయక పట్టుకొనుడు. (భయముతో నున్న విశ్వపతిని పోలీసులు పట్టుకొందురు)

నిరం:- విశ్వపతి ద్రోహబుద్ధి నేనాదినుండి యెరుగుదును. ఈతడు మోహన్ బలరాముల సహాయముచే వెంకటేశ్వరశాస్త్రిగారి ఇల్లు తగులబెట్టించెను. మురళీధరుని

హత్య యొనర్చి ఆకస్మికంగా తల్లి మందు నిమిత్తం ఆ వీధియందు బోవుచున్న నిర్దోషిఅయిన భాస్కర పంతులు లోనికిబోయి చూచు సమయమున బయటి వాకిలి బంధించి పోలీసులను బిలుచుకొని వచ్చి భాస్కరుని నేరస్థునిగా బంధింప జేసెను. ఇదిగో దీనికి తార్కాణము. మోహన్‌బలరాములు వ్రాసిన ఉత్తరం ఇది విశ్వపతి మోహన్ బలరాములకు వ్రాయించిన ఉత్తరం. ఇది పరిశీలిస్తే నిజానిజాలు బయటపడగలవు.

జడ్జి:- (ఉత్తరము చదువుకొని) అయితే నీవెవరవు? నీ వృత్తాంతమేమి?

నిరం:- (ప్రచ్ఛన్న వేషము తీసివేసి) అయ్యా! ఇది నా నిజ స్వరూపం. నాపేరు నిరంజనదాసు. మాలవాడను. నేను కొంతకాలము మురళీధరశాస్త్రిగారి ఇంట నౌకరిగానుండుటచే విశ్వపతి దుర్మార్గం నాకు తెలియును. కల్యాణి నొకచోట దాచిఉంచాడు. నేను అది గ్రహించి బైరాగి వేషముదాల్చి విశ్వపతిని మెప్పించి ఆయన ఆదరణకు పాత్రుడనైతిని. అందుచే ఈరోజు విశ్వపతి కోర్టుకు వస్తూ కల్యాణిగార్ని నా కప్పగించి వచ్చెను. ఆకారణముచేత నేను కల్యాణిగార్ని కూడ విముక్తురాలను జేసే భాగ్యం నాకబ్బింది ఆమె చెప్పేదికూడా తాము వినండి. తల్లీ! నీవు కూడ చెప్పాలి.

జడ్జి:- అమ్మా. నీవు చెప్పేదేదో చెప్పమ్మా.

కల్యా:- చిత్తం. నేను మురళీధరశాస్త్రిగారి యేకైకపుత్రికను. ఈ విశ్వపతి తల్లిదండ్రి గతించిన కారణాన మేన మామ అయిన మాతండ్రి వీనిని బాల్యంనుండి పెంచాడు. వీడు దుర్మార్గ వర్తనుడై తిరుగుచున్నను సహించాడు. కాని దానికిమాత్రం హద్దులేదా? నన్ను మోహించాడు. కాని నే నంగీకరించ లేదు, ఒక రాత్రి నాగదికి తయారయ్యాడు. నేను మా తండ్రిని కేక వేసాను. ఆ కేకవిని మా నాన్న గారువచ్చి వీనిని తిట్టారు. అదే సమయంగా భావించి మా నాన్న గార్ని వీడు కత్తితో పొడిచి చంపాడు. (నిట్టూర్పు విడిచి దుఃఖించును)

జడ్జి:- అమ్మా. దుఃఖించక చెప్పు.

కల్యా:- చిత్తం, నేనా హత్యజూచి మూర్ఛరాలనైనాను. పిమ్మట ఏమిజరిగినది నాకు తెలియదు. కాని నాకు తెలివి వచ్చునప్పటికి లేచి చూడగా నేను పరుల ఇంటిలో విశ్వపతిచే బంధింపబడినట్లు చూడగల్గాను. అప్పటినుండి నేటివరకు వీనిచే బంధింప బడియే యున్నాను. నేడు నా సుకృతవశమున యీదాను పుణ్యాన బయట పడ్డాను. భాస్కర మహాశయుడు నిర్దోషి. మీతీర్పు మార్చగలందులకు నాప్రార్థన.

జడ్జి:- అంతా విన్నాను. విశ్వపతి ద్రోహం నాకిప్పటికి బోధ పడింది, విద్యాధికుడును, సంఘ సంస్కర్తయు నగు భాస్కరరావు నిర్దోషి. పోలీసులారా! భాస్కరరావును విడవండి. ద్రోహియైన విశ్వపతిని కారాగృహమందు ద్రోయండి. మోహన్ బలరాములను వారంటుమీద పట్టుకొనిరండు. దుర్మార్గుడగు విశ్వపతిని 1-12-51 వ. తారీఖున ఉరితీయుటకు ఆజ్ఞ యొసంగుచున్నాను.

(వెంటనే పోలీసులు భాస్కరుని విడిచి విశ్వపతిని బంధించి కారాగృహమునకు తీసికొనిపోతారు)

ప్రాసి:-(కుమారస్వామితో) విశ్వపతి ఫీజ్ అంతాయిచ్చాడా? నాటకం మొదటితిరిగిందే?

కుమా:- లేదండి. రేపిస్తాను యెల్లుండిస్తానంటూ కాలంగడి పాడు. ఇవ్వలేదు. పెట్టలేదు.

ప్రాసి:- ఆరి పీడి తస్సదియ్యా. మననికూడ మోసంచేసాడు?

కుమా:- అదే పీడ కొంపతీసింది.

(హరిజనులు కొందరువచ్చి భాస్కరుని మెడలో పూలదండ వేతురు. పాటతో నిష్క్రమింతురు)



పంచమాంకము 3వ రంగము

భాస్క:- దాసూ. ఏమి నీచాకచక్యము. ఏమి నీమనోధైర్యం పంచమ కులములో ఇట్టి మేధాసంపన్నులు. ఇట్టి యుగంధర చక్రవర్తులుంటారనే సంశయం లేకుండా చేసావు. నీవు అభినవ యుగంధరుడవుగాని సామాన్య పంచముడవు కావు.

ఉ॥ పన్నితిపెవ్వుపన్నుగడ పల్వురుమెచ్చగ నీదుశక్తిచే।
నన్ను విముక్తిజేసితివి నామమనోహరి కష్టపాళివి
చ్ఛిన్నము చేసితీవుగద శీఘ్రమెసాధుగమారి నీఋణం
బెన్నటికైన తీర్చుకొను టెట్లు నిరంజన చిత్తరంజనా॥

(కల్యాణినిసమీపించి) ప్రేయసీ! నీవెంతయో సుకృతి వంతురాలవు. నీసుకృతమే నా ఉరిశిక్ష తప్పించినది. నీవును, దాసును ఈసమయంలో రాకున్నచో నాగతి యేమయ్యేదో కదా! మీరు నన్ను గాపాడుటకు వచ్చిన దేవతలు.

కల్యా:- దేవా. మీరు పొగడునంత శక్తివంతురాలను గాను క్లిష్టసమయంలో వచ్చాము, మిమ్ములను విముక్తులను జేయగలిగాము. మీకున్నూ, నాకున్నూ దాసు జీవితంలో మరువరాని మేలు చేసాడు.

నిరం:- బాబూ! అమ్మా! నావిద్యుక్త ధర్మం నెరవేర్చు కున్నాను. అది నావిధి. నేనింతమాత్రాన్ని హరిజనోద్ధారక మహనీయులగు మీస్తుతికి నేనర్హుడనా?

సీ॥ అన్నపానాలపై యాసక్తిబోనాడి
క్షణమొక్క యుగముగా గడిపియుంటి
కనుగ్రుడ్డుగుంట లోతునబడునట్లుగా
మసలక నిద్రయే మానియుంటి
నిలచినచోటిలో నిల్వక దేశంబు
తిరుగుచు కాలము గడిపియుంటి
బిచ్చమెత్తుటనాదు వృత్తిగా బాటించి
బైరాగివేషినై బడలియుంటి

తే॥ గీ॥ దంపతులమిమ్ము చెఱవిడిపింపదలచి
చెనటియగు విశ్వపతిని వంచింపనెంచి
హరిజనాభ్యుదయప్రౌఢి నరయగోరి
నేటికిటుపండెనేగడించిన తపంబు

జడ్జి:- (ప్రవేశించి) భాస్కరరావుగారూ, మీహరిజనాశ్రమ సందర్శనముచే చాల సంతోషించాను. నీదాక్షిణ్య స్వభావం, నీపరోపకార బుద్ధి, నీకార్యదీక్ష, నీ స్వార్థ త్యాగం అన్నీ కొనియాడ తగినవి. నీవంటి పుత్ర రత్నం భరతమాతగర్భాన జనించినందుకు మేమెంతో గర్వపడుచున్నాం.

భాస్క:- న్యాయమూర్తిగారూ. నమస్కారములు, మీదర్శనప్రాప్తి చేత నేనే కాక మా ఆశ్రమ వాసులుకూడ ధన్యులైనారు. మీరు వర్ణించే సుగుణాలు నాలో నంతగా లేవు. మామీదనుండే వాత్సల్యంవల్ల మాట్లాడు తున్నారు. మీవంటి మహనీయులచే స్తుతింపబడే అర్హత నాకు గలదా?

జడ్జి:- ఎవరికీ నీ శక్తి నారు గ్రహించలేరు. అది ప్రపంచంలో సహజం. నీ దర్శతే నీగొప్పతనం తెల్పుతుంది. నీఉద్యమమే నీ భూతదయ సాటిస్తుంది, నీ కష్టపరంపరే నీ ధైర్యం ప్రకటిస్తుంది. ఆకష్టాలు పాటించక నీవేకాకిగా హరిజనసేవ చేస్తున్నావు. కల్యాణితో నీ ఉద్యమం వృద్ధిపొందగలదు కష్టసుఖాల నిద్దరు పంచుకోగలరు. కనుక మీయిద్దరి వివాహం జరిగితే నేను ఆనందిస్తాను.

శాస్త్రి:- ఆ వివాహం చేయించే సుకృతం నాకిప్పించండి. భాస్కర కల్యాణుల వివాహం చూచే భాగ్యంకోసం ఎంతో కాలంనుండి తపిస్తున్నాను.

(జడ్జి భాస్కరునివైపుజూచి శాస్త్రిని జూపించును)

భాస్క:- శాస్త్రిగారు, వందనం. మీబోటి పెద్దలఆశీర్వచనం వల్ల మాసంకల్పం సిద్ధించింది. మాఉద్యమంకూడ సిద్ధిపొందేటట్లు మీమహదాశీర్వచనం అపేక్షిస్తు

న్నాం. సనాతనులైన మీరు మావివాహం చేయించే అభిలాష చూపడం మాఅదృష్టం.

శాస్త్రి:- నాయనా. మీదే పవిత్రమైన సనాతన మతం. మాది మిశ్రమసనాతనం. శిరోపదికాలాలు నిరంకుశాధికారంతో చెలాయించ దలచిన మామతం సనాతన సంకరంగాని కేవలం సనాతనమా? దయాదాక్షిణ్య రహితం. ప్రేమ శూన్యమైయిన మామతమేమి మతం? ఇప్పుడు నిజానిజాలు గ్రహించాను. నాజీవితముకూడ హరిజన సేవకై వినియోగిస్తాను. ఇకముందు మీ ఆశ్రమ పురోహితుడిగా నుంచి తరిస్తాను ఇదే నిజమైన సనాతనమని ప్రపంచంలో చాటుతాను. ఈ నాటికి మీయిరువుర వివాహం చేయించే సుకృతం లభించినందుల కానందపడుచున్నాను, ఇదే సుముహూర్తం వివాహం ప్రారంభిస్తాను. పూలదండలు. పూలదండలు. (అని కేక వేయగా దాసు పూలదండలను శాస్త్రిగారికివ్వబోయి వెనుకాడును శాస్త్రి నవ్వి చేతిలో దండలుతీసికొని దాసువీపున చరచును. భాస్కర కల్యాణి లొండొరుల మెడలో దండలు వేసికొందురు)

## వేదపఠనం

అయం ముహూర్త స్సుమూ ర్తమస్తు సుముహూర్తకాలేన సూర్యాదీనాం నవానాం గ్రహాణాంమానుకుల్యా ఫలసిద్ధి రస్తు - అయం ముహూర్తస్సుమూహూర్తమస్తు - మాంగల్య తంతునానేన తవజీవన హేతునా - కంఠే బధ్నామి శుభగే సాజీవ శరదాంశతం॥

ఈశ్వ:- మాకు భూరి సంభావన లిప్పించాలి. మామూలు పెండ్లికన్న సంస్కరణ బొందిన పెండ్లిగనుక భూరి సంభావన దయచెయ్యాలి. ఎన్నాళ్ళనుంచో మీ సంభావనకోసం నిరీక్షిస్తున్నాం.

సోమ:- మనసంగతి వారికి తెలియదటోయి. గొప్పవంశీయులు సంభావన దగ్గర వెనుకాడతారా? శాస్త్రిగారూ- (అని పిలిచి శాస్త్రిని తమనుగూర్చి చెప్పమని సైగ చేయబోవును)

భాస్క:- సోదరులారా. నాకృషి ఫలించినది. కష్టాలు మధ్య సంభవించినా దైవానుగ్రహంచేత అవి గట్టెక్కగలి గాను. ఇదివరకు నే నీ ఉద్యమంలో నొంటరిగా పాల్గొన్నాను. ఈనాటినుండి నేను నాప్రేయసి ఉభ యులముపాల్గొనిజీవితమందుకొఱకై వినియోగిస్తాము. మాజీవితాలేగాక మాకు సంక్రమించిన అపారమైన

ఆస్తియు ఈ దివ్య భవనమున్నూ హరిజనాశ్రమమున
కర్పిస్తాం. వందనములు.

– ఆహా ! నేడుకదా మాకు సుదినం. మా నోములు ఫలించాయి. మా హరిజనుల కష్టాలు తీరాయి. మా మొర దేవుడాలకించాడు. భాస్కరరావు పంతుల కృషివల్లనే హరిజనవాడలో ఇంత చైతన్యం కల్గింది. ఆపైన అపూర్వ ప్రేమచే చూపినవారి ఔదార్యము నకు మా హరిజనుల తరఫున నా కృతజ్ఞతా పూర్వక వందనాలు. సంఘసంస్కర్తలగు వీరికిని, వీరిసతీతిలకమగు కల్యాణమ్మ గారికిని దీర్ఘాయురారోగ్యములు ప్రసాదించుగాకయని భగవంతుని ప్రార్థిస్తున్నాను. ఇదిగాక సనాతనావలంబకులగు వెంకటేశ్వర శాస్త్రిగారు హరిజనసేవకై జీవితం అంకితంచేస్తామని చెప్పడం మాభాగ్యం. ఆశ్రమ పురోహితులుగా నుండుట కంగీకరించినందులకు మేము ధన్యులం. ఈ సుముహూర్త సమయాన విచ్చేసిన న్యాయాధిపతిగారికి సాధన్య వాదాలు. ధన్యులం ఇక మాకు కొదవేమి ! అయిన నిట్లగుగాక.

తే॥ గీ॥ పుడమినస్పృశ్యతాత్వంబు పొలియుగాక
సంఘమందలి దోషముల్ సమయుగాక
హరిజనులు జ్ఞానమునుబొంద నగునుగాక
భరతఖండమభ్యుదయంబు బడయుగాక॥

జయ్ భరత్‌మాతకు - జయ్ గాంధిమహాత్మాకు - జయ్ భాస్కరపంతులుకు - జయ్ కల్యాణమ్మగారికి- జయ్ ఆంధ్రప్రదేశ్‌కు

(వందేమాతరం పాటతో సమాప్తి.)



శ్రీ వాసవీ ప్రింటింగ్ ప్రెస్, మెయిన్‌రోడ్డు, తెనాలి.

## నా గ్రంథములు:-

| | |
|---|---|
| ఆత్మ దేశికుడు | 1-2-0 |
| మాలదాసు (నాటకం) | 2-0-0 |
| మానసదీపిక | 0-12-0 |

## రానున్న గ్రంథములు:-

భజగోవింద శ్లోకములు (ఆంగ్ల పద్యములు)

రెడ్ క్రాస్ (నాటికలు)

---

పుస్తకములు దొరకువారు:—

వంగిపురపు రామభద్రయ్య, బి. ఏ, బి. ఇడి.,

భారతీ గ్రంథమాల

వంగిపురం, (P. O.)

(Via) ప్రత్తిపాడు,

గుంటూరు జిల్లా.